## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఓజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మహాత్ముడు

♦ సంక్షిప్త జీవిత కథ ♦

బాలసాహిత్యం

దాశరథి రంగాచార్య




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,

హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

# మనవి

మహాత్ముడు. ఆ పేరు వినగానే ఒక జ్యోతిర్మూర్తి మన ముందు ప్రత్యక్షం అవుతుంది. మస్తకం అవగతం అవుతుంది. గుండెలో గౌరవం- భక్తి భావం పొర్లుతాయి. ఆయన రామునిలాంటి వీరుడు కాడు. కృష్ణునిలాంటి యుగపురుషుడు కాడు. బుద్ధునిలాంటి యోగి కాడు. క్రీస్తులాంటి ప్రవక్తకాడు. ఆయన సామాన్య భారతీయుని కంటె తక్కువ జీవితం గడిపాడు. సామాన్యునిలా తప్పులూ, ఒప్పులూ చేశాడు. అయినా ఆయన ముందు మోకరిల్లుతాం. ఎందుకు? ఆయన 40 కోట్లమంది భారతీయుల్ని తన కనుసన్నల్లో నడిపించారు. కాంగ్రెసులో ఆయన అభిప్రాయాలతోనూ, మతంతోనూ ఏకీభవించే వారికంటే వ్యతిరేకించేవారే ఎక్కువమంది వుండే వారు. అయినా ఆయనమాట జవదాటలేకపోయేవారు. ఒక్కోసారి ఆయన ప్రతిపాదనలకు తీవ్ర వ్యతిరేకత వుండేది. కాని తీరా ఓటింగు దగ్గరికి వస్తే ఆయనే నెగ్గేవాడు. అది ఆయనలోని మహత్తర శక్తి. అది అనితర సాధ్యం.

మహాత్ముడు ఆయన ముమ్మూర్తులా మహాత్ముడే. సూర్యుడు అస్తమించని బ్రిటిషు సామ్రాజ్య సింహాన్ని పట్టి ఖద్దరు పోగుతో కట్టివేయగలిగాడు. అది ఎవరికి సాధ్యం? శత్రువును సహితం మిత్రునిలా ప్రేమించగలగడం ఎవరికి సాధ్యం? ఒక్క మహాత్మునికే. "నా జీవితం మొత్తం అల్ప సంఖ్యాకుల కోసరమే. దుఃఖితుల కోసరమే అంకితం చేశా" నన్నారు. చిచ్చును లెక్కచేయకుండా ఉరికారు. తుదకు దుఃఖితుల కోసరమే బలి అయినారు.

రాముడు లేని రామయణం లేదు. మహాత్ముడులేని స్వాతంత్ర్య పోరాటంలేదు. అదో సాగరం... అందులో రకరకాల ఉద్యమాల అలలొచ్చాయి. పోరాటం ఆయనతోనే పుట్టింది. ఆయనతోనే అంతమొందింది. ఆయన చరిత్ర భారత స్వాతంత్ర్య సమర చరిత్ర. కాబట్టి మహాత్ముని గురించి తెలుసుకోవడం ప్రతి భారతీయుని కర్తవ్యం.

కొత్తగా అక్షరాస్యులైన వయోజనులకు అనుకూలంగా ఉండేట్లు మహాత్ముని సంక్షిప్త జీవిత చరిత్ర రచించాను. దీన్ని ప్రోత్సహించాల్సిన బాధ్యత అందరికీ వుంది.

దీని బాగోగులు నిర్ణయించాల్సింది మీరు.

**దాశరథి రంగాచార్య**

# మహాత్ముడు

## ❖ సంక్షిప్త జీవిత కథ ❖

**1947** ఆగస్టు 14వ తేదీ వరకు మన భారతదేశం ఇంగ్లీషువారి పాలనకింద సుమారు 200 సంవత్సరాలు నలిగింది. అప్పుడు మన దేశంలో వందలకొద్ది సంస్థానాలు ఉండేవి. మన ఆంధ్రప్రదేశంలో ఒక కోటి తెలుగువారున్న తెలంగాణం కూడా నిజాం నవాబు కింద ఉండేది. 1948లో నిజాం రాజ్యం భారతదేశంలో భాగం అయిపోయింది. 1956లో కోటి తెలంగాణపు తెలుగువారు తమ సోదరులైన 2 కోట్ల తెలుగువారితో కలిసిపోయారు. అదే ఇప్పటి మన ముచ్చటైన ఆంధ్రప్రదేశం.

నిజాం రాజ్యంలాగే గుజరాత్ రాష్ట్రంలో పోర్‌బందర్ అనే సంస్థానం ఉండేది. ఆ రాజ్యానికి ఉత్తమచంద్ర గాంధీ ప్రధానిగా ఉండేవాడు. ఆయన చాల ఉత్తముడు. ఆడి తప్పనివాడు. అతని అండ కోరినవారికోసం తన ప్రాణాలనైనా ఇచ్చేవాడు.

ఆ సంస్థానపు మహారాణికి ఒకసారి ఒక కోమటిమీద కోపం వచ్చింది. కోమటి గజగజా వణికిపోయాడు. అతడు వెళ్ళి ఉత్తమచంద్రుని శరణుజొచ్చాడు. ఉత్తమచంద్రుడు కోమటి ప్రాణాలు కాపాడ్తానని మాట ఇచ్చాడు.

రాణి కోమటికోసం వెతికించింది. ఎక్కడా దొరకలేదు. తుదకు అతడు ప్రధాని అండన ఉన్నాడు అని తెలిసింది రాణికి. కోమటిని తనకు అప్పగించమని రాణి ప్రధానిని ఆజ్ఞాపించింది. తన అండకు వచ్చినవాణ్ణి చూస్తూ చూస్తూ చావుకు ఎలా అప్పగిస్తాడు? అప్పగించనన్నాడు. రాణికి కోపం వచ్చింది. రాణికి కోపంవస్తే దెబ్బలకేం తక్కువ. ఉత్తమచంద్రుని ఇంటిమీదికి సైనికుల్ని పంపించింది. వారు తుపాకులు ఫిరంగులూ పేల్చారు. ఉత్తమచంద్రుని ఇంటి గోడలకు నేటికీ ఆ తుపాకి గుండ్ల



ఉత్తమచంద్రుడు

గుర్తులు కనిపిస్తాయి. అయినా ప్రధాని లొంగిపోలేదు. పదవి వదులుకుని తప్పించుకుని కోమటితో సహా జునాగఢానికి పారిపోయాడు.

జునాగఢంలో రాజు దగ్గరకికి వెళ్ళి నిండు సభలో ఎడమచేత్తో సలాం చేశాడు. రాజుకు కోపం వచ్చింది. ఎడమచేత్తో ఎందుకు సలాం చేశావని అడిగాడు. "మహారాజా! కుడిచేయి పోర్‌బందరుకు అంకితం చేశాను. మిగిలింది ఎడమచేయే మహారాజా" అన్నాడు. ఉత్తమచంద్రుని స్వామి భక్తికి రాజు చాల సంతోషించాడు. అతనికి ఆశ్రయం ఇచ్చాడు. కొంతకాలం అలా ఉండి తిరిగి పోర్‌బందర్‌కు వెళ్ళిపోయాడు.

ఉత్తమచంద్రుని కుమారుడు కరమ్‌చంద్ గాంధీ. అతడు ఎందులోనూ తండ్రికి తీసిపోనివాడు. చదువుకున్నది అయిదవ తరగతే. కాని అతనికి లోకానుభవం చాల ఎక్కువ ఉండేది. అతని అనుభవాన్ని చూచి పోర్‌బందర్ రాజు అతణ్ణి ఇరవై అయిదు సంవత్సరాల వయసులోనే తన రాజ్యానికి ప్రధానిగా నియమించాడు.

ఒకసారి కరంచంద్రుడు ఇంగ్లీషువారి ప్రతినిధి దగ్గరికి వెళ్ళాడు. ఆ తెల్లవాడు పోర్‌బందర్ రాజును నిందించాడు. రాజును తిడ్తుంటె ఓర్వలేకపోయాడు కరంచంద్రుడు. తెల్లవాణ్ణి ఎదిరించాడు. ఆరోజుల్లో తెల్లవారిని ఎదిరించడం అంటే చావు కోరి తెచ్చుకున్నట్లే. కరంచంద్రుడు అరెస్టు అయినాడు. కొన్ని గంటలు ప్రధాని, చెట్టుకింద అరెస్టులో ఉన్నాడు. కాని కరంచంద్రుడు లొంగలేదు. తెల్లదొర విధిలేక అతణ్ణి వదిలి వేశాడు.

కరంచంద్రుడు నాలుగు సార్లు పెండ్లాడాడు. చేసికొన్న భార్యల్లా చనిపోవడమే ఇందుకు కారణం. ఆయనకు నలభై ఏండ్లు ఉండగా "పుత్లీబాయి"ని పెండ్లి చేసుకున్నాడు. ఆమెకు ముగ్గురు కొడుకులూ, ఒక కూతురూ కలిగారు. వారిలో చివరివాడు మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ, ఆయన అక్టోబరు 2న 1869లో పోర్‌బందర్‌లో జన్మించాడు.

పుత్లీబాయి చాల నియమాలు కలది. అనేక వ్రతాలు లెక్కలేనన్ని నోములు నోచేది. ఎప్పుడూ దేవాలయా లకు వెళ్ళేది. పురాణాలు వినేది. గాంధీజీ సహితం ఆమె వెంట దేవాలయాలకు వెళ్తూ ఉండేవాడు. పురాణాలు వింటూ వుండేవాడు.

గాంధీజీకి ఏడు సంవత్సరాలు వచ్చాయి. బడికివెళ్ళే ఈడు వచ్చింది. అప్పటికి కరంచంద్రుడు రాజస్థాన్‌లోని న్యాయ స్థానంలో ఉద్యోగం అయింది. కరంచంద్రుడు రాజకోటకు మారాడు. అక్కడే గాంధీజీని బళ్ళో చేర్చారు.

గాంధీజీకి ఎక్కడలేని బిడియం వుండేది. ఎవరితోనూ మాట్లాడేవాడుకాడు. పుస్తకాలు, చదువు తప్ప వేరే పిల్లలతో మాట్లాడేవాడుకాడు. సరిగ్గా గంటకొట్టే సమయానికి బడికి వెళ్ళేవాడు. మళ్ళీ గంటకొట్టగానే తలవంచుకుని ఇంటికి చేరేవాడు.

గాంధీజీ మంచి చురుకైన విద్యార్థిగా వుండేవాడు. కాని ఎప్పుడూ తన తెలివిగలవాణ్ణి అని అనుకునేవాడు కాడు. ఆయనకు అనేక బహుమానాలూ, విద్యార్థి వేతనాలూ లభించేవి.

## బాల్య వివాహం

**గా**ంధీజీకి పదమూడు ఏండ్లు వున్నప్పుడే పెళ్ళి అయింది. "పెండ్లి అంటే మేళాలు, కొత్త బట్టలు, ఊరేగింపులు, రకరకాల తినుబండారాలు, ఆడుకోడానికి కొత్త సావాసకత్తె లభించడం అనే సంబరమే కాని అంతకంటె నాకేమీ తెలియదు" అని రాసుకున్నారు గాంధీజీ. చిన్నతనపు పెండ్లిళ్ళు చాల చెడ్డవని గాంధీజీ చెప్పారు. "చిన్నతనాన పెండ్లి చేయాలనడాన్ని ఎలాంటి నీతి కూడా ఒప్పుకోదు అన్నారు గాంధీజీ. పెండ్లిళ్ళకోసం విపరీతంగా ఖర్చుచేసి తల్లిదండ్రులు జీవితం ఉన్నంతకాలం అప్పులపాలు కావడం అంటే ఆయనకు చాలబాధగా ఉండేది. మనదేశంలో "తల్లిదండ్రులు పెండ్లిళ్ళు చేసి నాశనం అవుతున్నారు" అన్నారు. వీటన్నిటివల్ల మనం గుణపాఠం నేర్చుకోవాలి. మహాత్ముని మాటల్ను గమనించి ఆచరణలో పెట్టాలి.

గాంధీజీ పెళ్ళాడింది కస్తూరిబాను. అప్పటికి ఆమెకు చదువు రాదు. గాంధీజీ ఆమెకు చదువు చెప్పాలనుకున్నాడు. కాని ఆమెకు చదువుకోవాలని ఉండేదికాదు. ఆమె ఇష్టానికి వ్యతిరేకం అయినా గాంధీజీ ఆమెకు చదువు చెప్పాడు.

## పాఠశాల

పెళ్ళివల్ల ఒక సంవత్సరం చదువు చెడిపోయింది. కాని గాంధీజీ చురుకైన విద్యార్థి. కాబట్టి ఉపాధ్యాయులు మూడవ తరగతిలో ఆరునెల్లు మాత్రమే వుంచి నాల్గవ తరగతికి పంపించారు. ఆ రోజుల్లో నాల్గవ తరగతి అంతా ఇంగ్లీషులోనే వుండేది. అదికాక సంస్కృతం కూడా వుండేది. సంస్కృతం గాంధీజీకి వచ్చేది కాదు. సంస్కృతం చదవనివారు పారశీకం చదవాల్సి వచ్చేది. ఒకనాడు గాంధీజీ సంస్కృతపు తరగతి వదలి పారశీ తరగతికి వెళ్ళాడు. అది సంస్కృతపు ఉపాధ్యాయునికి తెలిసింది. ఆయన గాంధీజీని పిలిపించాడు. "నాయనా! నీ తల్లిదండ్రులు వైష్ణవులు. మరి నీవామతపు భాష నేర్చుకోవద్దా? నీకు కష్టం అనిపించినప్పుడు నన్ను అడుగవచ్చును కదా! నాకు చేతనైనంత సహాయం చేస్తాను. సంస్కృత భాషలో ఎన్నో చక్కని విషయాలు ఉన్నాయి. మళ్ళీ సంస్కృతం తరగతికి రా. నా మాట విను" అని అనేక విధాల బోధించాడు. "అప్పుడు అభ్యసించిన కొద్దిపాటి సంస్కృతమే లేకున్నట్లు అయితే మన మత గ్రంథాలంటే భక్తి కుదరడం కష్టం అయ్యేది" అని రాసుకున్నారు గాంధీజీ. "ప్రతి హిందూ బాలుడూ, హిందూ బాలికా సంస్కృత భాష సంపూర్ణంగా అభ్యసించాల"ని గాంధీజీ చెప్పారు.

ఒకసారి గాంధీజీ "సత్య హరిశ్చంద్ర" నాటకం చూచాడు. హరిశ్చంద్రుడు సత్యం కోసం పడ్డ అగచాట్లు చూచి ఆయన చాల బాధపడ్డాడు.



బాపు పుట్టినిల్లు

"హరిశ్చంద్ర నాటకం నా హృదయంలో నాటుకుని పోయింది. ఎన్నిసార్లు చూచినా ఆ నాటకం నాకు విసుగు అనిపించదు. అయితే ఆ నాటకం చూడ్డానికి తల్లిదండ్రులు ఎన్నిసార్లు అనుమతిస్తారు?

ఆ నాటకాన్ని మరిచిపోలేకపోయాను. అనేకసార్లు నాకు నేను అభినయం చేసుకున్నాను".

"హరిశ్చంద్రునిలా అందరూ సత్యసంధులు ఎందుకు కాలేరు? అని నన్ను రాత్రింబవళ్ళు ప్రశ్నించుకున్నాను.

సత్యవాక్య పరిపాలనకు హరిశ్చంద్రుడు పడ్డ కష్టాలన్నీ నాకు ఆదర్శంగా కనిపించాయి".

"హరిశ్చంద్రుని కథ యదార్థమైన కథ అని విశ్వసించాను. ఆయనపడ్డ బాధలనుగూర్చి ఎప్పుడు ఆలోచించినా కన్నీరు బొటబొట కారేది" అని గాంధీజీ చెప్పుకున్నారు.

ఒకసారి తండ్రి తెచ్చిన "శ్రావణ పితృభక్తి నాటకం" అనే పుస్తకం చదివారు గాంధీజీ. శ్రావణుడు గొప్ప పితృభక్తి కలవాడు.



బాపూజీ ప్రతిజ్ఞ చేయుట

అతడు తన ముసలి తల్లిదండ్రుల్ని కావడిలో మోసుకుని తీర్థయాత్రలు చేయించినాడు. తల్లిదండ్రులకోసం పెళ్ళి చేసుకోకుండా వుండిపోతాడు. ఆ నాటకం చదివి తనూ ఆ విధంగా తల్లిదండ్రులకు సేవ చేయాలనుకున్నారు గాంధీజీ. చేశారు కూడా.

# మాంసం

గాంధీజీ నాల్గవ తరగతిలో వుండగా ఆయనకు షేక్ మెహతాబ్ అనే ఒక చెడు బాలునితో స్నేహం అయింది. అతని సహవాసం మానుకొమ్మని తల్లిదండ్రులూ, భార్యా చెప్పారు. గాంధీజీకి కూడా తన స్నేహితుడు చెడ్డవాడని తెలుసు. కాని గాంధీజీ చెడు స్నేహితంవల్ల చెడిపోతాననుకోలేదు. చెడువాణ్ణి తన సహవాసంతో బాగు చేద్దామనుకున్నాడు.

ఇంగ్లీషువారు భారతదేశంలో పాతుకుపోయారు. చదువుకున్న వారంతా ఇంగ్లీషువారివలె ఉండాలనుకునేవారు. వారిలాగే దుస్తులు ధరించడం, వారిలాగే తినడం నేర్చుకోసాగారు. తండ్రి తాతలనుండి వస్తున్న ఆచారాల్ని వదిలి తెల్లవారిని అనుకరించడం సంస్కరణ అనే వారు. మాంసం తినడం, సారాయి తాగడం నేర్చుకోసాగారు. ఎన్నడూ మాంసం అంటనివారు సహితం మాంసం తినడం మొదలుపెట్టారు. సారాయి కంపు సహితం గిట్టనివారు తాగుడు నేర్చుకున్నారు.

గాంధీజీని మాంసం తినమని బలవంతం చేశాడు షేక్ మెహతాబ్. "మాంసం తినకపోవడం మూలాన్నే మనం బలహీనులం అయిపోయాం. మాంసం తిని బలవంతులైన ఇంగ్లీషువారు మనలను పాలిస్తున్నారు. నా బలం చూస్తున్నావు కదా పరుగులో నాకు సాటిలేరు. ఇందుకు కారణం నేను మాంసం తినడమే. మాంసం తినేవాళ్లకు కురుపులు పుట్టవు. పుట్టినా త్వరలోనే మానిపోతాయి. మన గురువుల్లో చాలామంది చాటుగానో నేటుగానో మాంసం తింటూనే వున్నారు. అలా మాంసం తినే మన గురువులూ, మిగతా పెద్దలూ బుద్ధిలేని వారు కారు కదా? వారంతా అందులోని గుణం తెలుసుకునే తింటున్నారు. నీవూ తిని చూడు. ప్రయత్నానికి మించింది లేదు. తింటే అది ఎంత బలం ఇస్తుందో నీకే తెలుస్తుంది" అని అనేక విధాల బోధించాడు.

మెహతాబ్ నిజంగానే మంచి బలం కలవాడు. సాహసి. రెక్కలు కట్టుకున్నట్లు పరుగెత్తేవాడు. ఎంతో ఎత్తుకు ఎగుర గలిగేవాడు. అతని శరీరం ఎంత బాధైనా సహించగలిగేది. గాంధీజీ చాలా బలహీనంగా ఉండేవాడు. పరిగెత్తలేడు. ఎగుర లేడు. దుముకలేడు. వట్టి పిరికివాడు. దొంగలు, భూతాలు, పాములు అంటే అదిరిపడేవాడు. చీకటిపడ్తే గడప దాటలేక పోయేవాడు. చీకట్లో పడుకుంటే ఒకవైపునుంచి దయ్యాలు, మరోవైపునుంచి పాములు, ఇంకోవైపునుంచి దొంగలూ తరుముతున్నట్లుగా భయపడేవాడు. మరి మెహతాబో? అతడు పాముల్ని చేత్తో పట్టుకుని ఆడిస్తాననేవాడు. దొంగలంటే జంకూ కొంకూ ఉండేవి కావు. దయ్యాలు, భూతాలు లేనే లేవనేవాడు.

మాంసం తినకపోవడం మూలాన్నే తాను పిరికివాణ్ణి అయిపోయాననుకున్నాడు గాంధీజీ. మాంసం తినడానికి అంగీకరించాడు.

"మాంసం తినడం అంటే తల్లిదండ్రుల్ని మోసగించడం అని నాకు తెలియదనాలా? ఎలా అనగలను? అనలేను. సంస్కారం అనే భూతం నామీద సవారీ అయింది. నాలుక రుచికోసం ఇందులోకి దిగలేదు. మాంసం రుచిగా ఉంటుందనే విషయం నాకు తెలియదు. నేను గట్టి శరీరం గలవాణ్ణీ, ధీరుణ్ణీ కావాలి. నా దేశ ప్రజలంతా అలాంటివారే కావాలి. ఇదే నాకు పట్టిన సంస్కారం. అది నన్ను గుడ్డివాణ్ణి చేసింది" అన్నారు గాంధీజీ.

ఒకరోజు మెహతాబ్ గాంధీజీని ఏటి ఒడ్డుకు తీసికెళ్ళాడు. అక్కడ ఒక వైపు నాను రొట్టె ఇంకోవైపు మాంసం పెట్టి వున్నాయి. గాంధీజీ మాంసంముక్క తీసుకున్నాడు. నోట్లో వేసుకున్నాడు. నమలలేకపోయాడు. అది ఏ మాత్రం రుచిగా లేదు. రెంటినీ వదిలి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి గాంధీజీ చాల బాధపడ్డాడు. నిద్ర పట్టలేదు. అలా కన్ను మలిగినప్పుడల్లా మేకపొట్టలో చేరి అరుస్తున్నట్లు అనిపించేది. దిగ్గున ఉలిక్కిపడి లేచేవాడు. గాంధీజీ మాంసం తినేది రుచికోసం కాదు. అది తన కర్తవ్యం అని తింటున్నాడు. అందుకు ఆయన అన్నింటినీ మరిచి మళ్ళీ మాంసం తినడానికి సిద్ధం అయినాడు. మెహతాబ్ మాంసంతో రకరకాల పదార్థాలు చేయించాడు. క్రమంగా గాంధీజీకి అసహ్యం తగ్గింది.

విందు జరిగిన్నాడల్లా ఇంట్లో భోజనం చేసేవాడుకాదు. ఆకలి లేదనో, అన్నం అరగలేదనో సాకు చెప్పేవాడు. ఎన్నాళ్ళు ఇలా సాకులు చెపుతాడు? అబద్ధం చెపుతున్నాని గాంధీజీకి తెలుసు. ఎవరితో అబద్ధం చెప్పేది? తల్లికీ, తండ్రికీ. రహస్యం ఎంతకాలం దాగుతుంది? బయటపడ్తే? తల్లిదండ్రుల గుండె పగులుతుంది. తల్లిదండ్రుల్ని సంతోషపెట్టడం కంటే మాంసం తినడం ముఖ్యమా? అని ఆలోచించాడు. శ్రవణ కుమారుడు గుర్తుకు వచ్చాడు. అబద్ధం ఆడలేక ఆలుబిడ్డల్ని అమ్ముకున్న హరిశ్చంద్రుణ్ణి తలుచుకున్నాడు. అప్పుడు గాంధీజీ "మాంసం తినడం ముఖ్యమే. దేశంలో సంస్కారం జరగాల్సిన మాట నిజమే. కాని ఒకర్ని మోసగించడం, తల్లిదండ్రుల్తో అబద్ధం ఆడటం కంటే మాంసం తినకపోవడమే మేలు" అనుకున్నాడు గాంధీజీ మళ్ళీ మాంసం ముట్టలేదు.

## పొగతాగడం

గాంధీజీకి ఇంకో స్నేహితుడు వుండేవాడు. అతడు గాంధీజీ దగ్గరి బంధువు. వారిద్దరూ పొగ పీల్చాలనుకున్నారు. పొగ పీల్చడం మంచిది కాదని, ఇష్టం వుంది కాని వారు పీల్చాలను కోలేదు. పొగ పీల్చి నోటినుంచి పొగమబ్బులు వదలడం వారికి సరదాగా ఉండేది. వారి పినతండ్రిని చూచి వారు అలా చేయాలనుకున్నారు. సిగరెట్లు తాగడం అయితే నేర్చుకున్నారు కాని అవి కొనడానికి

డబ్బు ఎక్కణ్ణుంచి వస్తుంది? పినతండ్రి కాల్చి పారేసిన సిగరెట్లు కాల్చేవారు. ఆ ముక్కలు ఎప్పటికీ దొరక్కపోయేవి. దొరికినా వాటినుంచి దట్టమైన పొగరాక పోయేది. వారింట్లో ఒక నౌకరు ఉండేవాడు. అతని చొక్కా మేకుకు తగిలించి ఉన్నప్పుడు అందులోంచి డబ్బు దొంగిలించారు. నాటు పొగాకు చుట్టలు కొని కాల్చారు. డబ్బు అయిపోయింది. పొగమబ్బులు ఎలా? కొన్ని మొక్కల దంట్లు కాల్చి పీలిస్తే పొగ మబ్బులు వస్తాయని తెలుసుకున్నారు. అవి కాల్చారు.

"పెద్దల అనుమతి లేకుండా నేనేమీ చేయడానికి వీలులేదు. ఇది నాకు భరించరానిది అనిపించింది. ఈ పరాధీనపు బతుకు అంటే నాకు విసుగు అనిపించింది. తుదకు ఆత్మహత్యకు సిద్ధపడ్డాం" అన్నారు గాంధీజీ. ఆత్మహత్య అంటే తన్ను తానే చంపుకోవడం. ఎలా చంపుకోవాలి? విషం మింగాలి. విషం కొనడానికి డబ్బేది? ఉమ్మెత్త గింజల్లో విషం ఉంటుందని వారికి ఎవరో చెప్పారు. ఉమ్మెత్తగింజలు సంపాదించారు. దేవాలయంలోకి వెళ్ళి చెరొక స్తంభానికి ఆనుకుని కూర్చున్నారు. ఒక్క గింజ తిన్నారో లేదో వారి ధైర్యం చచ్చి పోయింది. ఇన్నాళ్ళనుంచి చావుకు సిద్ధం అయినారు. తీరా చావు వచ్చే వరకల్లా వారికి ధైర్యం చాలలేదు. గింజలు తింటే వెంటనే ప్రాణం పోకుంటే? పోనీ ప్రాణం పోయిందే అనుకున్నా చచ్చి సాధించేది ఏమిటి? చావకూడదని నిర్ణయించుకున్నారు.

ఆత్మహత్య చేసుకోవాలనే తలంపు వారికి ఎందుకు వచ్చింది? స్వేచ్ఛ లేకపోవడం వల్ల. స్వేచ్ఛ దేనికి? దొంగతనం చేయడానికి. దొంగతనం దేనికి? సిగరెట్లు కొనడానికి. వీటన్నింటికి కారణం సిగరెట్లే. ఇన్ని దుర్మార్గాలకు కారణం అయిన సిగరెట్లు ఎందుకు మానేయకూడదు? మానేయాలి అనుకున్నారు. మానేశారు. గాంధీజీ బతికి వున్నన్నాళ్ళూ మళ్ళీ సిగరెట్టు ముట్టలేదు.

## పశ్చాత్తాపం

గాంధీజీ అన్న మాంసం తినడానికి అలవాటుపడ్డాడు. మాంసం తినడానికి అప్పులు చేశాడు. అప్పులవాళ్ళు అడగడం మొదలు పెట్టారు. అతని చేతికి ఉన్న బంగారపు కడియంలోని బంగారం ముక్క ఒక్కటి తీసి గాంధీజీ వారి అన్నా కలిసి అమ్మివేశారు. అన్నగారి అప్పు తీరింది. కాని దొంగతనం చేశానని గాంధీజీ చాలా విచారపడ్డాడు. ఇకముందు దొంగతనం చేయరాదని నిశ్చయించు కున్నాడు. చేసిన దొంగతనానికి శిక్ష అనుభవిద్దామనుకున్నాడు. చెప్పడానికి ధైర్యం చాలలేదు. కొడ్తాడని భయం కాదు. తండ్రి ఎంత బాధపడ్తాడో అని వ్యధ. జరిగిన విషయం అంతా చీటిమీద రాశారు గాంధీజీ.

అప్పటికి కరంచంద్ జబ్బుతో బల్లమీద పడుకుని ఉన్నాడు. చీటి తండ్రికి అందించి చేతులు కట్టుకుని నుంచున్నాడు గాంధీజీ. చీటి చదివిన కరంచంద్రుని కళ్ళలోంచి జలజలనీళ్ళు కురిశాయి. క్షణం కళ్ళు మూసుకుని ఆలోచించి చీటీ చింపివేసి పడుకున్నాడు కరంచంద్. గాంధీజీ గొంతు దుఃఖంతో నిండిపోయింది. భోరున ఏడ్చారు. "నా తండ్రిబాధ నా కన్నుల కట్టినట్లు వుండెను. నేటికీ ఆ దృశ్యం నా గుండెను తినివేస్తున్నది. ప్రేమపూరితమైన ఆ కన్నీరు నా గుండెను కడిగి పాపాన్ని తుడిచివేసింది" అన్నారు గాంధీజీ.

## పెద్దల ఆజ్ఞ

ఒకసారి గాంధీజీ స్కూలుకు ఇన్‌స్పెక్టరు వచ్చాడు. ఆయన ఒకపదం చెప్పి అందర్నీ రాయమన్నాడు. గాంధీజీ తప్పు రాశారు. పంతులు అది చూచి గాంధీజీని కాలితో పొడిచి సంజ్ఞచేశాడు. పక్క పిల్లవాణ్ణి చూచి రాయమని. పంతులు సంజ్ఞచేస్తున్నాడని గాంధీజీ గ్రహించారు. "మేము కాపీ కొట్టకుండా చూడ్డం కోసం

కదా ఉపాధ్యాయుడు అక్కడ ఉన్నది" అనుకున్నారు గాంధీజీ. ఆయన పక్కవాణ్ణి చూసి రాయలేదు.

"అలా జరగడంవల్ల ఉపాధ్యాయునిమీద నాకున్న గౌరవం ఏ మాత్రం తగ్గలేదు...పెద్దల ఆజ్ఞ పాలించడమే నాకు అలవడింది. వారి పనులకు వంకలు పెట్టడం నేను నేర్వలేదు" అన్నారు గాంధీజీ.

## తండ్రి మరణం

**గాం**ధీజీకి పదహారు సంవత్సరాల వయసు వున్నప్పుడు కరంచంద్రునికి జబ్బు చేసింది. తండ్రి పుండుకు కట్టుకట్టడం, వేళకు మందు ఇవ్వడం గాంధీజీ చేసేవాడు. అవసరం అయినప్పుడు దినుసులన్నీ నూరి మందు సిద్ధం చేసేవాడు. రాత్రిళ్ళు తండ్రి నిద్రపోయేదాకా కాళ్ళు వత్తేవాడు. బడికి పోయిన వేళలో తప్ప మిగతా సమయం అంతా తండ్రి సేవలోనే గడిపేవాడు.

ఎన్ని మందులిచ్చినా వ్యాధి కుదురుతున్నట్లు కనిపించ లేదు. రోగం రోజురోజుకూ ముదిరిపోతూంది. అన్నీ పక్కలోనే జరుగుతున్నాయి.

ఒకనాటి రాత్రి పదకొండు గంటల దాకా తండ్రికి కాళ్ళు పిసికాడు, పినతండ్రివచ్చి కాళ్ళు వత్తుతానన్నాడు. గాంధీజీ పడక గదిలోకి వెళ్ళిపోయాడు. అయిదారు నిముషాల్లో మనిషివచ్చి తలుపు నెట్టాడు. గాంధీజీ ఆదుర్దాగా తలుపు తీశాడు. ఏముంది? కరంచంద్రుడు అస్తమించాడు. గాంధీజీ దుఃఖానికి అంతులేదు.

## లండన్ తయారీ

**1887**వ సంవత్సరంలో గాంధీజీ మెట్రిక్యులేషన్ పరీక్ష పాసైనాడు. ఆ తరువాత భావనగరంలోని శ్యామలదాసు కళాశాలలో చేరారు. అక్కడ అతనికి చిరాకుగా ఉండేది. తరగతిలో ఏమీ అర్థం అయ్యేదికాదు. ఈలోగా శలవులు వచ్చాయి. ఇంటికి వచ్చేశాడు. మళ్ళీ కళాశాలకు వెళ్ళడం ఇష్టం లేదు.

మావుజీదేవు అనే పండితుడు వుండేవాడు. అతడు కరంచంద్రుని స్నేహితుడు. అతడు గాంధీజీని చదువును గురించి పుత్లీబాయితోనూ, గాంధీజీ అన్నగారితోనూ మాట్లాడాడు. "కాలం రోజు రోజుకూ మారిపోతోంది. తండ్రిగారి దివాన్గిరీ సంపాదించాలంటే మంచి చదువు కావాలి. మోహన్‌దాసు ఇంకా చిన్నవాడు. చదువుతున్నాడు కూడా. కాబట్టి ఏనాటికైనా తండ్రి పీఠం ఎక్కుతాడనే ఆశ వుంది. బి.ఏ. ప్యాసు కావాలంటే నాలుగేండ్లు కావాలి. అప్పటికైనా దివాన్గిరి దొరుకుతుందని నమ్మకం ఏమిటి? ఏదో అరవై రూపాయలు జీతం దొరకవచ్చు. నాకొడుకులా ప్లీడరు అవుతే బాగుంటుంది. కాని అది ఇంకా ఆలస్యం అవుతుంది. అప్పటికి దివాన్గిరికోసం అనేకమంది లాయర్లు సిద్ధం అవుతారు. కాబట్టి ఇంగ్లాండు పంపడం మంచిది. ఇంగ్లాండు వెళ్ళి వచ్చినా దివాన్గిరి అతని కాళ్ళముందుకు వస్తుంది. కాబట్టి మోహన్ దాసును ఇంగ్లాండు పంపండి" అన్నాడు.

కళాశాలకు వెళ్ళడం కంటే ఇంగ్లాండు వెళ్ళడం అంటేనే గాంధీజీకి బాగనిపించింది. "ఇంగ్లాండు వెళ్ళినవారు తాగుడుకూ, జారత్వానికీ అలవాటు పడిపోతార"ని పుత్లీబాయికి చాలమంది చెప్పారు. ఆమె గాంధీజీని ఇంగ్లాండు పంపడానికి అంగీకరించలేదు. "“అమ్మా నన్ను నమ్మలేవా? నీతో బొంకుతానా? అలాంటి ప్రమాదం వుంటే మావుజీ మాత్రం నన్ను వెళ్ళమంటారా" అన్నాడు గాంధీజీ.

"నిన్ను నమ్మలేక కాదు నాయనా. ఎక్కడో దూరదేశంలో ఉన్నవాణ్ణి నమ్మి ఎలా ఉండాలి? నాకేమీ తోచడం లేదు. అయినా చెబార్జిస్వామిని అడిగి చూస్తా" అన్నది తల్లి.

చెబార్జిస్వామి కూడా మావుజీవలేనే గాంధీ కుటుంబ క్షేమం కోరేవాడు. అతడు పుత్లీబాయితో "భయపడకు మోహనుడితో మూడు శపథాలు చేయిస్తా. తరువాత నీవు నిశ్చింతగా ఉండొచ్చు" అని గాంధీజీ మూడు శపథాలు చేయించాడు.

1. సారాయి అంటను.

2. మాంసం తినను.

3. ఆడదాని జోలికిపోను" అని గాంధీజీ ప్రమాణం చేశాడు.

తల్లి లండన్ వెళ్ళడానికి అంగీకరించింది.

ఇంగ్లాండు వెళ్ళే ఓడ బొంబాయినుంచి బయలుదేరుతుంది. పుత్లీబాయి గాంధీజీని ఆశీర్వదించింది. కస్తూరీబా ఆయనకు వీడ్కోలు ఇచ్చింది. గాంధీజీతోపాటు ఆయన అన్నగారు కూడా బైల్దేరారు. వారు బొంబాయి చేరారు. జూన్, జూలై నెలల్లో హిందూ మహా సముద్రంలో తుఫాన్లు వస్తుంటాయి. కాబట్టి ఆ నెలల్లో ఓడ ప్రయాణం క్షేమం కాదని తెలిసింది. గాంధీజీని బొంబాయిలోనే వుంచి అన్నగారు రాజకోట వెళ్ళిపోయారు.

## కులంలో తుఫాను

గాంధీజీ ఇంగ్లాండు వెళ్తున్నాడనే విషయం బొంబాయిలో వున్న గాంధీజీ కులం వాళ్ళందరికీ తెలిసింది. అప్పటివరకు వారి కులంవారు ఎవరూ ఇంగ్లాండు వెళ్ళలేదు. కులపువారంతా ఒక సమావేశం ఏర్పాటు చేశారు. గాంధీజీని పిలిపించారు. కులపు పెద్ద "గాంధీజీ మన కులం వాళ్ళంతా నీ సీమ ప్రయాణం తగదు అంటున్నారు మనం సముద్ర ప్రయాణం చేయకూడదు. అక్కడికి వెళ్ళినవాళ్ళకు కులగోత్రాలు వుండవని మేము విన్నాం. తెల్లవారితో కలిసి తిండీ తాగుడూ తప్పవట. దీనికి సమాధానం ఏమిటి?" అని అడిగాడు.

"సముద్ర ప్రయాణం పనికిరాదని నాకు అనిపించడం లేదు. నేను అక్కడికి చదువుకోవడానికి వెళ్తున్నాను. మీరు ఏ విషయం అయితే భయపడ్తున్నారో వాటిని ముట్టనని ప్రమాణం చేశాను. ప్రమాణమే నన్ను కాపాడుతుంది" అన్నారు గాంధీజీ.

"అక్కడికి వెళ్ళింతరువాత కులం చెడడం తప్పదు. నీ తండ్రి నాకు స్నేహితుడు. నా మాట విను" అన్నాడు కులపెద్ద.

"మీరు నా తండ్రికి స్నేహితులు. నాకు పూజ్యులు. ఆ విషయం నాకు తెలుసు. నా సీమ ప్రయాణం నిశ్చయం అయిపోయింది. ఇప్పుడు నేనేం చేయగల్ను? మా తండ్రికి స్నేహితుడు పండితుడూ అయిన బ్రాహ్మడు ఈ పనిలో తప్పు లేదన్నాడు. మా అమ్మా, అన్నా నాకు అనుమతి ఇచ్చారు అన్నారు గాంధీజీ.

"అయితే కులపుమాట వినవన్నమాట. కులాన్ని వ్యతిరేకిస్తావా?"

"నేను ఇంతకంటే ఏమీ చెప్పదల్చుకోలేదు. ఈ విషయంలో కులంవారు కలిగించుకోవద్దు.

కులపు పెద్దకు కోపం వచ్చింది. పిట్ట కొంచెం కూత ఘనం అని గాంధీజీని ఏమీ అనలేదు. అప్పుడు కులపు పెద్ద "ఈ కుర్రాడికి నేటినుంచి కులపువెలి. ఈతణ్ణి సాగనంపేవారికి, ఆదుకునేవారికి రూపాయిపావలా జుల్మానా వేస్తున్నా" అని తీర్పు చెప్పారు.

గాంధీజీ వెలిని లెక్కచేయలేదు కాని అన్నగారు ఏమంటారో అని భయపడ్డాడు. అన్నగారికి జరిగిందంతా ఉత్తరం ద్వారా తెలియజేశాడు. "కులపువారిని లెక్కచేయకు. నీవు వెళ్ళడానికి నేను అనుమతిస్తున్నా" అని అన్నగారి దగ్గరనుంచి జవాబు వచ్చింది.

శ్రీ త్రియంబకరావు మజుందారు అనే జునాగఢపు వకీలు కూడా ఇంగ్లాండు వెళ్తూవున్నాడు. ఆయన గదిలోనే గాంధీజీకి కూడా స్థలం ఏర్పాటు చేయబడింది. గాంధీజీ మిత్రులంతా ఆయన్ను మజుందారుకు అప్పగించారు. మజుందారు వయసులో పెద్దవాడు. అనుభవం కలవాడు. అతనితో అనుభవంలేని పద్దెనిమిది సంవత్సరాల గాంధీజీ ఇంగ్లాండు వెళ్తున్నాడు.

సెప్టెంబర్ 4న గాంధీజీ ఓడ లండన్‌కు బైల్దేరింది.

# ఇంటిబెంగ

గాంధీజీ లండన్ చేరారు. ఆయన మజుందారుతో సహా హోటల్లో చేరారు. బట్టలు మార్చుకోవాలని గాంధీజీ తహతహ లాడారు. సామాను రాలేదు. ఈ రోజు ఆదివారం, సోమవారం కాని సామాను రాదు. గాంధీజీ చాలా బాధపడ్డాడు. హోటల్లో ఖర్చు విపరీతంగా అవుతూంది. గాంధీజీకి ఏదీ రుచించక పోయేది. ఒక పదార్థం రుచించక వేరే పదార్థం తెప్పించేవాడు. అదీ రుచించక ఇంకోటి తెప్పించి వాటిలో ఏదీ తినకున్నా డబ్బు చెల్లించడం తప్పేది కాదు. హోటల్ బతుకు విసుగు పుట్టింది. ఓడలో గాంధీజీకి ఒక సింధుప్రాంతపువాడి పరిచయం ఏర్పడింది. అతడు వారికోసం వేరే బస ఏర్పాటు చేశాడు.

బస కొత్త గదుల్లోకి మార్చడం జరిగింది. కాని అక్కడ గాంధీజీకి సుఖంగా లేదు. ఎప్పటికీ భారతదేశం - రాజకోట - పోర్‌బందర్ కళ్ళల్లో ఆడుతుండేవి. తల్లి ధ్యాస బాధపెడ్తూ ఉండేది. రాత్రిళ్ళు నిద్రపట్టేదికాదు. ఇల్లు, కస్తూరిబాయి, తల్లి, అన్న మనసులో మెదులుతూ ఉండేవారు.

ఆ బస నుండి గాంధీజీ మళ్ళీ ఒక సంసారుల ఇంటికి మారాడు. ఇంటి యజమాని గాంధీజీని తమ్ముడిలా చూసుకునేవాడు. ఇంటావిడ కూడా గాంధీజీని ప్రేమతో చూసేది. అక్కడివారికి తాలింపు వేయడం రాదు. కూరలు వట్టిగా ఉడికించి పెట్టేవారు. గాంధీజీకి రుచించేవి కావు. గాంధీజీకి ఇష్టం అయినట్లు చేసిపెట్టాలనుకునేది ఇంటావిడ. కాని ఆమెకు రాదు. మారు వడ్డించమంటే మర్యాదకు లోపం అవుతుందేమోనని భయం. దానికి తోడు పాలు దొరికేవి కావు. ఇంటి యజమానికి గాంధీజీమీద జాలి గలిగేది. "నీవే తమ్ముడివైతే ఈ వరకల్లా నిన్ను ఇంటికి పంపి ఉండేవాణ్ణి. ఇక్కడి పరిస్థితులు తెలియకముందు చదువురాని



లండనులో విద్యార్థి గాంధీ

తల్లితో చేసిన శపథాన్ని పట్టుకుని కూర్చుంటావా? నీ పట్టు మొండిపట్టు. అది విడువకుంటె నీవు ఇక్కడ నిలువలేవు" అని ఎన్నో తీర్లుగా గాంధీజీని మాంసం తినమని ప్రోత్సహించాడు. కాని గాంధీజీ ఆవగింజంత సహితం లొంగలేదు. ఎన్ని కష్టాలు పడ్డా గాంధీజీ తన శపథం వదల్లేదు.

## పొదుపు

ఇంగ్లాండులో డబ్బు విపరీతంగా ఖర్చు అవుతుంది. జరిగే ప్రతి ఖర్చును గురించీ రాసిపెట్టడం గాంధీజీ అలవాటు.

పెరిగిపోయిన ఖర్చుల్ని తగ్గించడానికి ప్రయత్నాలు సాగించాడు. సంసారుల ఇంట్లో ఉండడం మానేశాడు. వేరే రెండు గదులు అద్దెకు తీసుకున్నాడు. అందువల్ల కొంత ఖర్చు తగ్గింది. ఎక్కడికి పోవాల్సి వచ్చినా నడిచి వెళ్ళేవారు. దానివల్ల డబ్బు మిగలడమేగాక వ్యాయామం కూడా అయ్యేది.

బారిస్టరు పరీక్ష అయ్యేవరకూ ఊరికే కూర్చోవడం ఎందుకు అనుకున్నారు. లాటిన్ భాష నేర్చుకోవడం ప్రారంభించారు. ఆరు నెలల్లో ఆయన ఆ భాషను చక్కగా నేర్చుకున్నారు.

ఖర్చు తగ్గించడం చదువు ఎక్కువ నేర్చుకోవడం మొదలుపెట్టారు గాంధీజీ. అడిగినప్పుడల్లా అన్నగారు డబ్బు పంపుతున్నారు. అలా పంపడానికి ఆయన ఎంత బాధ పడుతున్నారో అనుకున్నారు. ఇంకా ఖర్చులు తగ్గించాడు. రెండు గదులు ఇల్లు వదిలివేశారు. ఒక గది ఇల్లు అద్దెకు తీసుకున్నారు. కుంపటి కొనుకున్నారు. ఓట్ల పిండి జావ, కోకో కోసరం నీళ్ళు కాచుకునేవారు. ఈ విధంగా ఉదయపు భోజనం స్వయంగా తయారుచేసుకునేవారు. మధ్యాహ్నం హోటల్లో భోజనం చేసేవారు. రాత్రి ఇంటి దగ్గరే రొట్టె తిని కోకో తాగేవారు. ఆ విధంగా ఆయన పొదుపు చేశారు.

ఆడంబరంకోసం చేసే వృధా ఖర్చులు మాని సాధ్యం అయినంతవరకు పొదుపు చేయడం మనం నేర్చుకోవాలి. అలాంటి పొదుపు ఆనాటి కంటె ఈనాడు ఎక్కువ అవసరం.

## మతం

గాంధీజీ ఇంగ్లాండులో రెండు సంవత్సరాలు గడిపారు. రెండో ఏడు చివర ఆయనకు ఇద్దరు దివ్యజ్ఞాన సమాజకుల్తో పరిచయం అయింది. వారికి భగవద్గీత అంటే ఎక్కువ ఇష్టం. కాని వారికి సంస్కృతం రాదు. భగవద్గీత సంస్కృతంలో ఉంది. వారు దాన్ని ఇంగ్లీషులో చదివేవారు. వారు గాంధీజీని భగవద్గీత

శ్లోకాలు సంస్కృతంలో చదవమన్నారు. వారితో కలిసి ఆయన భగవద్గీత చదివారు. అందులో విషయాలు నేర్చుకుని ఆనందించారు. "భగవద్గీత చాల గొప్ప గ్రంథం. దానిమీద నాకు రోజు రోజుకూ గౌరవం పెరుగుతున్నది. నిజం తెల్సు కోవడానికి అంతకంటే మంచి గ్రంథం లేదని నాకు గట్టి నమ్మకం కలిగింది. నాచుట్టూ చీకట్లు కమ్ముకున్నప్పుడల్లా ఆ గ్రంథం నాకు వెలుగు చూపింది. ఆ గ్రంథం చేసిన మేలు ఇంతింతని చెప్పలేను" అన్నారు గాంధీజీ.

గాంధీజీకి ఒక క్రైస్తవునితో స్నేహం అయింది. అతడు శాకాహారి. క్రైస్తవమతాన్ని గూర్చి గాంధీజీకి బోధించాడు. అతడు గాంధీజీకి "బైబిల్" ఇచ్చాడు. బైబిల్ క్రైస్తవుల మత గ్రంథం. అందులో రెండు భాగాలు ఉంటాయి. ఒకటి పాత నిబంధన. అది క్రీస్తు పుట్టుక ముందుంది. రెండవది కొత్త నిబంధన. అది క్రీస్తు పుట్టిన తర్వాతది. రెంటిలో కొత్త నిబంధన ఆయనకు బాగా నచ్చింది. "పాపానికి ఎదురీదకు. కుడిచెంప కొడ్తే ఎడమచెంప తిప్పు. చొక్కా దొంగిలించిన వానికి పంచె కూడా ఇచ్చేయి. ఇది నా ఉపదేశం" అన్నాడు క్రీస్తు. అది గాంధీజీకి బాగా నచ్చింది. అన్ని మతాల సారం త్యాగమే పరమ ధర్మమని నాకు తెలిసింది" అన్నారు గాంధీజీ. బాపూజీకి మతాలన్నీ ఒకటే. ఏ మతమైనా మంచినే బోధిస్తుందని ఆయన నమ్మకం.

## బారిస్టరు పరీక్ష

గాంధీజీ బారిస్టరు పరీక్షలకుగాను "ఇన్నర్ టెంపుల్" అనే పాఠశాలలో చేరాడు. అందులో చదువుకంటే విందులకే ఎక్కువ ప్రాధాన్యత ఉండేది. సంవత్సరాన్ని నాలుగు భాగాలుగా పంచేవాడు. ఒక్కొక్క భాగంలో 24 విందులు జరిగేవి. 24 విందుల్లోనూ కనీసం ఆరింటికి హాజరు కావాలి. విందులో ప్రతి నలుగురికీ



బారిస్టరు గాంధీ

రెండు సీసాల సారాయి ఇచ్చేవారు. గాంధీజీ తాగేవాడు కాడు. కాబట్టి అందరు  ఆయన్ను మా జట్టులో ఉండమంటే మా

జట్టులో ఉండమని పిల్చేవారు. గాంధీజీ ఉడికించిన ఆలుగడ్డలు, రొట్టె మాత్రమే తినేవారు. బారిస్టురు పరీక్షలు జరిగాయి. 10 జూన్ 1891న గాంధీజీ బారిస్టరు పరీక్షలో ఉత్తీర్ణుడు అయినాడు.

12, జూన్ 1891 యస్.యస్. ఆస్సామ్ అనే ఓడలో గాంధీజీ భారతదేశానికి బైల్దేరాడు.

## కులం వెలి

గాంధీజీ బొంబాయిలో ఓడ దిగారు. పుత్లీబాయి పరమ పదించిందని తెలిసింది. ఆమె చనిపోయి చాలాకాలం అయింది. కాని విషయం లండనులో ఉన్న గాంధీజీకి అన్నగారు తెలియపర్చలేదు. "నా తండ్రి చావు నాకింత దుఃఖం కలిగించలేదు. నేను పెట్టుకుని ఆశలన్నీ అడియాస లైనాయి" అని గాంధీజీ దుఃఖించారు.

గాంధీజీని కులంలోంచి వెలివేశారు కదా! మళ్ళీ గాంధీజీ వచ్చారు. ఆయన్ను కులంలో చేర్చుకోవాలన్నారు కొందరు. వద్దన్నారు మరికొందరు. కులంలో రెండు చీలికలు అయినాయి. కులంలో చేర్చుకోవాలన్నవారిని సంతోషపెట్టాలనుకున్నాడు గాంధీజీ అన్నగారు. గాంధీజీని నాసిక్ తీసుకుని వెళ్ళారు. అక్కడ నదిలో స్నానం చేయించాడు. అక్కడినుంచి వారు రాజకోట వెళ్ళారు. అక్కడ గాంధీజీ అన్నికులాలవారికి పెద్ద విందు చేశారు. గాంధీజీ మళ్ళీ కులంలో చేరాడు.

## చిన్న కేసు

బొంబాయిలో ఉండి హైకోర్టు వ్యవహారాలు నేర్చుకో వలసిందిగా గాంధీజీకి పెద్దలు సలహా చెప్పారు. బొంబాయి చేరారు గాంధీజీ. నాలుగైదు నెలలు గడిచాయి. ఖర్చులు పెరిగిపోతున్నాయి. ఆదాయం లేదు. పత్రికలో ఒక స్కూలుకు

ఇంగ్లీషు బోధించే ఉపాధ్యాయుడు కావాలని ప్రకటన చూశాడు. ఉద్యోగం కోసం దరఖాస్తు పంపారు. పిలుపు వచ్చింది. కాని ఉపాధ్యాయుడు బి.ఏ. ప్యాసై ఉండాలన్నారు.

ఖర్చులు భరించలేక బొంబాయినుండి మళ్ళీ రాజకోట చేరుకున్నారు. అక్కడ దరఖాస్తులూ విన్నపాలు రాయడం మొదలు పెట్టాడు. నెల.కు రెండుమూడు వందలు ఆదాయం వస్తూ ఉంది.

## అవమానం

పోర్‌బందరు రాజావారికి గాంధీజీ అన్న సలహాదారుగా ఉండేవాడు. తప్పు సలహా ఇచ్చాడని తెల్ల అధికారి అతణ్ణి తొలగించాడు. ఆ నేరాన్ని విచారించేవాడు లండనులో గాంధీజీకి తెల్సినవాడు. అతనికి సిఫార్సు చేయమని అన్నగారు గాంధీజీని కోరాడు. ఇష్టం లేకున్నా గాంధీజీ వెళ్ళాల్సి వచ్చింది. అధికారి గాంధీజీ మాటలు వినకుండానే "మీ అన్న వట్టి తంత్రగొట్టు. నేనేమీ వినను. వినడానికి తీరికకూడా లేదు" అన్నాడు. అయినా గాంధీజీ ఏదో చెప్పబోయాడు. అధికారికి మరీ కోపం వచ్చింది. "మీరిక వెళ్ళవచ్చు" అన్నాడు. అప్పటికీ గాంధీజీ "నన్ను పూర్తిగా చెప్పనీండి" అన్నాడు. అధికారి మండిపడ్డాడు. నౌకర్ను పిలిచాడు. గాంధీజీని బైటికి పంపించమని ఆజ్ఞాపించాడు. గాంధీజీ వెనుకముందు లాడాడు. నౌకరు గాంధీజీ భుజం మీద చేయివేసి బైటికి పంపించాడు.

గాంధీజీకి బాగా కోపం వచ్చింది. "మీరు నన్ను అవమాన పర్చారు. క్షమాపణ కోరుకోండి. లేదా తగు చర్య తీసుకోవాల్సి వస్తుంది" అని చీటీ రాసి అధికారికి పంపారు. "మీ ఇష్టం వచ్చిన చర్య తీసుకోవచ్చు" అని జవాబు వచ్చింది.

గాంధీజీకి అవమానం అయింది. అన్నగారితో చెప్పారు. ఆయన ఊరడించలేకపోయారు. అధికారిమీద తగుచర్య

తీసుకోవాలనుకున్నారు గాంధీజీ. వకీళ్ళను అడిగాడు. ఫెరోజిషా మెహతా ఆ రోజుల్లో పెద్ద వకీలు. గాంధీజీ అన్నగారు అతన్ని అడిగారు. "చాలమంది వకీళ్లకు, బారిస్టర్లకు ఇలాంటివి కొత్తకాదు. కాగితం చించి పారేసి అవమానం దిగమింగడం మంచిది" అని అన్నాడు మోహతా. మెహతా చెప్పిన సలహా విషం లాంటిది అయినా గాంధీజీ మింగక తప్పింది కాదు.

ఇంతలో గాంధీజీ అన్నగారికి పోర్‌బందరు వర్తకులు ఒక ఉత్తరం రాశారు. దక్షిణాఫ్రికాలో వారికి ఒక వ్యవహారం ఉంది. దాన్ని గురించి లాయర్లకు విప్పి చెప్పడానికి గాంధీజీని పంపించమని కోరారు వర్తకులు. గాంధీజీ అందుకు అంగీకరించారు.

1893వ సంవత్సరంలో గాంధీజీ ఓడమీద దక్షిణాఫ్రికా బైల్దేరారు.

## దక్షిణాఫ్రికా

దక్షిణాఫ్రికాలో నల్లవారిని చాల నీచంగా చూశేవారు. వారిని కూలీలు అనేవారు. గాంధీజీ కూడా నల్లవాడేకదా. ఆయన్ను కూలీ బారిస్టరు అనేవారు. గాంధీజీ ఆఫ్రికా వెళ్ళింది అబ్దుల్లా సేటు దావాకోసం కదా. సేటు గాంధీజీని కోర్టుకు తీసుకెళ్ళారు. గాంధీజీ తలపాగా చుట్టుకున్నాడు. జడ్జి గాంధీజీని తలపాగా తీసివేయమన్నాడు. గాంధీజీ తీసివేయ నన్నాడు. కోర్టు నుండీ వెళ్ళిపోయాడు. పత్రికలన్నీ ఆయన్ను పొగడాయి. గాంధీజీ ఒకసారి ఫస్టుక్లాసులో ప్రయాణం చేస్తున్నాడు. గార్డు వచ్చి నల్లవారు ఫస్టుక్లాసులో ఎక్కకూడదు. దిగిపొమ్మన్నాడు. ఆయన దిగలేదు. గాంధీజీని లాగివేశాడు. ఆయన అధికారులకు తెలియజేశాడు. వారు ఆయనకు మొదటి తరగతి ప్రయాణం ఏర్పాటు చేశారు. ఒకసారి ఆయన గుర్రపు బండిలో ప్రయాణం చేయాల్సివచ్చింది. బండ్లో అంతా తెల్లవారు ఉన్నారు. ఆయన్ను బండితోలేవాడిపక్కన కూర్చో మన్నారు. ఆయన కూర్చున్నాడు. ఆయన దిగలేదు.




గాంధీ అటార్నీ

బండివాడు ఆయన్ను పిచ్చిగా బాదాడు. గాంధీజీ మాట్లాడలేదు. కొందరు తెల్లవారే బండివాణ్ణి కొట్టవద్దన్నారు. నల్లవారు రాచబాట పక్కన నడవడం నేరం. గాంధీజీ ఒకసారి రాచబాట పక్కనుండి

వస్తున్నాడు. పోలీసులు ఆయన్ను పడదోసి కొట్టారు. అబ్దుల్లా దావాలో రాజీ కుదిర్చారు గాంధీజీ. అక్కడి ప్రభుత్వం భారతీయులకు ఓటుహక్కు లేకుండా చేయాలనుకుంది. గాంధీజీ దాన్ని ఎదిరించాలనుకున్నాడు. అక్కడ "నేటాల్ ఇండియన్ కాంగ్రెస్" స్థాపించాడు. గాంధీజీ ఒక పెద్ద దరఖాస్తు తయారుచేశాడు. ఆంగ్ల ప్రభుత్వానికి పంపాడు. ఆ శాసనం చేయవద్దని ఆంగ్ల ప్రభుత్వం ఆఫ్రికా ప్రభుత్వాన్ని కోరింది. గాంధీజీకి విజయం లభించింది. తరువాత ఆయన భారతదేశం వచ్చారు. ఆఫ్రికా భారతీయులు పడే బాధల్ను గురించి ఒక కరపత్రం రాశారు. పత్రికలన్నింటికీ పంపారు. పంచిపెట్టారు. దక్షిణాఫ్రికా రావలసిందని కేబుల్ వచ్చింది. గాంధీజీ కుటుంబంతో బయల్దేరారు. గాంధీజీ ఓడ ఆఫ్రికా చేరింది. గాంధీజీ ఓడ దిగారు. తెల్లవారంతా గుంపులుగా కూడి ఆయన్ను బాదారు. ఒక తెల్ల ఆవిడ ఆ హింస చూడలేక పోయింది. దుండగుల్ని బెదిరించింది. గాంధీజీని క్షేమంగా ఇంటికి చేర్చింది.

దక్షిణాఫ్రికా ప్రభుత్వం ఒక శాసనం చేసింది. ఆ శాసనం ప్రకారం ఎనిమిది సంవత్సరాలు దాటిన నల్లవారంతా ప్రభుత్వం దగ్గర తమ పేర్లు రాయించుకోవాలి. గాంధీజీ అది చూచి సహించలేకపోయారు. పోరాటానికి సిద్ధం అయినారు. పోరాటం అంటే ఎదిరించడం కాదు. బాధపడ్డం. దానికి ఆయన 'సత్యాగ్రహం' అని పేరుపెట్టారు. ఎవరూ పేర్లు రాయించుకో వద్దు అన్నారు గాంధీజీ. ఎవరూ రాయించుకోలేదు. గాంధీజీని అరెస్టు చేసింది. ఇంకా చాలామంది పట్టుబడ్డారు. ప్రభుత్వం లొంగింది. మొదలు అందరూ పేర్లు రాయించుకోవాలన్నది. తరువాత శాసనం రద్దుచేస్తానన్నది. మొట్టమొదలు గాంధీజీ తమ పేరు రాయించు కున్నారు. ప్రభుత్వం శాసనం రద్దుచేయలేదు. గాంధీజీ అనుమతి పత్రాలన్నింటినీ తగుల పెట్టించాడు. మూడు సంవత్సరాలు

దాటాయి. ప్రభుత్వం శాసనం రద్దు చేయలేదు. మళ్ళీ సత్యాగ్రహం ప్రారంభించాడు. ఐదువేలమంది భారతీయుల్ని గాంధీజీ ట్రాన్సువాలుకు నడిపించాడు. తోవలో ఆయన అరెస్టు అయినాడు. తొమ్మిది నెలలు శిక్షపడింది. ఇరవైవేలమంది కార్మికులు సమ్మెచేశారు. పోలీసులు తుపాకులు కాల్చారు. అనేకమంది ప్రాణాలు విడిచారు. తుదకు ప్రభుత్వం లొంగిపోయింది. గాంధీజీ జయించారు.

ఆయన భారతదేశం బైల్దేరారు.

## మహాత్ముడు

గాంధీజీ సత్యాగ్రహంలో జయించాడు. ఆయన మహాత్ముడు అయినాడు. మహాత్ముడు భారతదేశం వచ్చాడు. అనేకమంది ఆయనకు సన్మానం చేశారు. మహాత్ముడు కొచరాజలో ఒక ఆశ్రమం స్థాపించాడు. ఆ ఆశ్రమంలో ఇరవై అయిదుమంది స్త్రీ పురుషులు ఉండేవారు.

## చంపరాను

మనదేశానికి ఉత్తరాన హిమాలయా పర్వతాలున్నాయి. ఆ ప్రాంతంలో చంపరాను అనే జిల్లా ఉంది. అక్కడి జమీందార్లు రైతుల్ని చాల హింసలు పెట్టేవారు. ప్రతి ఇరవై ఎకరాల్లోనూ మూడు ఎకరాలు నీలిమందువేయాలని నియమం పెట్టారు. అందువల్ల రైతులకు చాలా నష్టం వచ్చింది. రోజంతా పని చేయించుకుని అణా, రెండణాలు కూలి ఇచ్చేవారు. మహాత్మునికి ఈ విషయాలు తెలిశాయి. ఆయన చంపరానుకు బైల్దేరాడు. పాట్నాలో ఆగాడు. అక్కడ ఆయన చాలామంది పెద్దపెద్దవారిని కలిశాడు. వారిలో రాజేంద్రప్రసాదు ఒకరు. వారంతా గాంధీ మహాత్మునితో పోరాడ్తామని వాగ్దానం చేశారు.

చంపరాను ముఖ్యపట్టణం మోతహారి. మహాత్ముడు అక్కడికి బైల్దేరారు. ఏనుగుమీద ప్రయాణం. తోవలో ఒక పోలీసు అధికారి

మహాత్ముని దగ్గరికి వెళ్ళాడు. "చంపరాను విడిచి వెళ్ళిపోవలసింది" అనే ఆజ్ఞగల పత్రం మహాత్మునికి అందించాడు. "చంపరాను పరిస్థితులు తెలుసుకునేదాకా వెళ్ళను" అని మహాత్ముడు రాసి ఇచ్చాడు. "మీరు పోలీసు ఆజ్ఞలను ధిక్కరించారు. రేపు విచారణ జరుగుతుంది. కోర్టుకు హాజరు కావలసింది" అని రాసి ఉంది.

తెల్లారి మహాత్ముడు కోర్టుకు హాజరు అయినాడు. న్యాయ స్థానం జనంతో కిటకిటలాడిపోయింది. విచారణ ప్రారంభం అయింది. భారతదేశ ప్రజలు ఎక్కడ ఉన్నా వారి క్షేమం విచారించడమే నాధర్మం" అన్నాడు మహాత్ముడు. న్యాయ మూర్తికి ఏమీ తోచలేదు. కేసు వాయిదా వేశాడు. వాయిదారోజు రాకముందే ప్రభుత్వం కేసు వాపసుతీసుకుంది. గవర్నరు మహాత్ముని పిలిపించాడు. మహాత్ముడు గవర్నరుతో మాట్లాడాడు. చంపరాను రైతుల స్థితి విచారించడానికి ఒక సంఘం వేయబడింది. మహాత్ముడు కూడా ఆ సంఘంలో సభ్యులు. వారు ఒక నివేదిక సిద్ధం చేశారు. ప్రభుత్వం ఆమోదించింది. రైతులకు నీలిమందు బెడద వదిలింది.

ఇది భారతదేశంలో మహాత్ముని మొదటి విజయం.

## కార్మిక విజయం

అహమ్మదాబాదులో అనేక మిల్లులు ఉన్నాయి. వాటి యజమానులు కూలీలను చాల బాధపెట్టారు. కూలి తక్కువ ఇచ్చేవారు. ఎక్కువ పని చేయించుకునేవారు. కార్మికులు మహాత్ముణ్ణి పిలిచారు. మహాత్ముడు అహమ్మదాబాదు వెళ్ళాడు. యజమానులు మహాత్మునికి తెలిసినవారే, కూలి ఎక్కువ చేయమని వారికి నచ్చచెప్పారు. వారు వినలేదు. కార్మికులతో సమ్మె చేయించారు మహాత్ములు. సమ్మె బాగా సాగింది. కాని సమ్మె చేసే కార్మికులు చేయనివారిని బాధపెట్టారు. మహాత్ముడు చాలా బాధపడ్డారు. "సమ్మె విషయం తేలేదాకా అన్నం ముట్టను" అని వ్రతం పట్టాడు.

యజమానులు పరిష్కారానికి ఒప్పుకున్నారు. మూడు రోజులు కటిక ఉపవాసం చేసి విజయం సాధించారు మహాత్ములు.



ఉపన్యాసం

# ఖేడా

మనదేశంలో ఉన్న రాష్ట్రాల్లో గుజరాతు ఒకటి. ఆ రాష్ట్రంలో ఖేడా ఒక ప్రాంతం. 1918వ సంవత్సరంలో ఆ ప్రాంతంలో పంటలు పూర్తిగా చెడిపోయాయి. రైతులు శిస్తు మాఫీ ఇవ్వమని ప్రభుత్వాన్ని అడిగారు. ప్రభుత్వం వినలేదు. పూర్తి శిస్తు వసూలు చేస్తానన్నది. అక్కడి పరిస్థితులు విచారించడానికి ఒక సంఘం వేయమని మహాత్ముడు ప్రభుత్వాన్ని కోరాడు. మహాత్మునిమాట ప్రభుత్వం వినలేదు. మహాత్ముడు సత్యాగ్రహానికి సిద్ధం అయినాడు. సర్దార్ వల్లభభాయి పటేల్ తన వృత్తి వదులు కున్నాడు. రెండు వేలమంది సత్యాగ్రహానికి సిద్ధం అయినారు. ప్రభుత్వం రైతుల పశువులను అమ్మింది. ఆస్తులను జప్తు చేసింది. పంటలు జప్తు చేసింది. జప్తు చేసిన పొలంలోని ఉల్లిగడ్డను తొలగించమన్నాడు మహాత్ముడు. చాలామంది పంట తొలగించారు. అరెస్టు అయినారు. శిక్ష పడింది. వేలమంది జనం వారిని సాగనంపారు. నాలుగునెలలు పోరాటం సాగింది. ప్రభుత్వం రాజీకి వచ్చింది. పేదవారికి శిస్తు మాఫీ అయింది. విజయభేరి మోగింది. రైతులు పండుగ చేసుకున్నారు.

# రౌలటు చట్టం

దౌర్జన్యంతో ప్రజలను అణచివేయడానికి రౌలటు చట్టం చేయబడింది. మహాత్ముడు దాన్ని సహించలేకపోయాడు. సత్యాగ్రహం చేయాలన్నాడు. వేలమంది సభ్యులుగా చేరారు. సత్యాగ్రహానికిగాను ప్రజల్లో ఎంత ఉత్సాహం ఉందో చూడాలనుకున్నారు. ఒక రోజు మానుకుని ఉపవాసం చేయాలని మహాత్ముడు ప్రజల్ని కోరారు.

30 మార్చి ఆదివారంనాడు హర్తాళ్ చేయాలని మహాత్ముడు నిశ్చయించాడు. తరువాత ఆ తేదీ మరుసటి అదివారానికి మార్చబడింది. ఆ రోజు 6 ఏప్రిల్ అవుతుంది.

## ఢిల్లీ

ఢిల్లీ ప్రజలకు తేదీ మార్పు తెలియలేదు. ఢిల్లీలో ముప్పై మార్చినాడే హర్తాళ్ జరిగింది. ఢిల్లీ భారతదేశానికి రాజధాని. అది పాడుపడ్డట్టు అయింది. ఒక్క దుకాణంకూడా తెరువబడలేదు. ఒక పెద్ద సభ జరిగింది. నలభై వేలమంది ప్రజలు సభకు హాజరు అయినారు. పోలీసులు తుపాకులు కాల్చారు. తొమ్మిదిమంది చనిపోయారు. చాంద్నీచౌక్ రక్తంతో ఎర్రబారిపోయింది. భారతదేశం యావత్తూ కోపంతో కన్నెర్ర చేసింది.

## బొంబాయి

బొంబాయి ఏప్రిల్ ఆరు కోసం ఎదురుచూసింది. ఏప్రిల్ మూడున మహాత్ముడు బొంబాయి చేరాడు. ఏప్రిల్ ఆరునాడు చౌపాతి దగ్గర వేలకొద్ది జనం కూడారు. అంతా సముద్రంలో స్నానాలు చేశారు. అనేక సభలు జరిగాయి. ప్రజలకు జైలు భయం వదిలింది.

ఢిల్లీకి రావలసిందిగా మహాత్మునికి పిలుపు వచ్చింది. ఆయన ఢిల్లీ బైల్దేరారు. దోవలో ఒక పోలీసు ఒక ఆజ్ఞ అందించాడు మహాత్మునికి. ఢిల్లీ వెళ్ళవద్దని ప్రభుత్వం మహాత్ముణ్ణి నిషేధించింది. మహాత్ముడు ఆజ్ఞను లెక్కచేయలేదు. అరెస్టు చేయబడినాడు. పోలీసులు మరునాడు బొంబాయి తీసుకువచ్చి మహాత్ముణ్ణి వదిలారు.

మహాత్ముడు అరెస్టు అయినాడనే వార్త బొంబాయిలో అగ్గిలా పాకిపోయింది. నగరం యావత్తు ఉడికిపోయింది. మహాత్ముడు బొంబాయి వచ్చాడు. ఆయన్ను చూచి జనులు సంతోషంతో పొంగిపోయారు. నిముషాల్లో లక్షలకొద్ది జనులు పోగు అయినారు. "వందేమాతరం" అనే నినాదాలు ఆకాశం అంటాయి. ఊరేగింపు సాగిపోతూంది. కొంతదూరం సాగింది. గుర్రాలను ఎక్కిన పోలీసులు

ఎదురైనారు. గుర్రాలు గుంపులోకి చొచ్చుకునిపోయాయి. బెత్తాల్తో బాదసాగారు పోలీసులు. కొందరు గుర్రాల డెక్కల కింద అణిగిపోయారు. కొందరు బెత్తపు దెబ్బలు తగిలి పడిపోయారు. పోలీసులు రాక్షసుల్లా జనాన్ని బాదారు. జనానికి పిచ్చెక్కింది. ట్రాములు ఆపారు. పోలీసులమీద రాళ్ళు రువ్వారు. హింస జరిగినందుకు మహాత్ముడు చాల నొచ్చుకున్నాడు. హింసకు దిగకుండా ప్రశాంతంగా ఉండి బొంబాయి గౌరవం దక్కించవలసిందని ఆయన బొంబాయి ప్రజల్ని కోరాడు. అహమ్మదాబాద్‌లో మిల్లు కార్మికులు అనేకసార్లు ఊరేగింపులు తీశారు. పోలీసులు కాల్పులు సాగించారు. జనులు చావడానికి సిద్ధం అవుతున్నారు. వారి కోపం చల్లారడంలేదు. పోలీసులు లొంగిపోయారు. ఓడిపోయారు. సైనికరాజ్యం ప్రకటించబడింది.

మహాత్ముడు అహమ్మదాబాదు చేరాడు. అక్కడ శాంతి ఏర్పర్చాల్సిందని మహాత్ముణ్ణి ప్రభుత్వం కోరింది. పెద్ద సభ జరిగింది. "హింసను మానివేయాలి. చేసినదానికి పశ్చాత్తాప పడాలి. అలాచేయని నాడు మనం విజయం సాధించలేం" అని మహాత్ముడు ఉపన్యసించారు.

అహమ్మదాబాదులో శాంతి ఏర్పడింది.

## జలియన్ వాలాబాగ్

పంజాబులో ఏప్రిల్ 6న హర్తాళ్ జరిగింది. అమృతసర్‌లో రెండురోజులూ హర్తాళ్ జరిగింది. అంటే 30 మార్చిన, 6 ఏప్రిల్‌న జరిగిందన్నమాట. ఏప్రిల్ తొమ్మిది శ్రీరామనవమి. పెద్ద ఊరేగింపు తీశారు ప్రజలు. ఊరేగింపులో వేలకొద్ది ప్రజలు పాల్గొన్నారు. ప్రభుత్వానికి కన్ను కుట్టింది. నాయకులను అరెస్టు చేసింది. ప్రజలు రెచ్చిపోయారు. దుకాణాలు అన్ని బందైనాయి. ఫ్యాక్టరీలు మూసివేయబడ్డాయి. బ్రహ్మాండమైన ఊరేగింపు బైల్దేరింది.

పోలీసులు రెండుసార్లు తుపాకులు కాల్చారు. అనేకమంది అక్కడే ప్రాణాలు వదిలారు. అయినా ప్రజలు వెనక్కు తగ్గలేదు. రక్తం చూసి ప్రజలు రెచ్చిపోయారు. అయిదారుగురు తెల్లవారిని చంపేశారు. తెల్లవారి బ్యాంకులు తగలబెట్టారు. టెలిగ్రాఫ్ తీగలు తెంపేశారు. పబ్లిక్ హాలు తగలబెట్టారు. పోలీసులు ఏమీ చేయలేకపోయారు. సైనికులు దిగారు. ఏప్రిల్ 11న నేల ఈనినట్లు జనం పోగైనారు. కాల్పుల్లో చనిపోయిన వారిని శ్మశానానికి పెద్ద ఊరేగింపుగా తీసికెళ్ళారు. ఆ జనాన్ని చూచి ప్రభుత్వం జనరల్ డయ్యర్ అనేవాణ్ణి పిలిపించింది. అతడు రాక్షసుడు. వచ్చిన తెల్లవారే అనేక మందిని అరెస్టు చేశాడు. సభలు నిషేధించాడు. ఏప్రిల్ 13 సాయంకాలం 4.30కు జలియన్ వాలాబాగ్‌లో సమావేశం జరుగుతుందని ప్రకటించబడింది. సభను ఆపడానికి డయ్యర్ ప్రయత్నించలేదు. సభకు పదివేలమంది ప్రజలు వచ్చారు. డయ్యర్ మిలిటరీవారితో అక్కడికి వచ్చారు. డయ్యర్ మిలిటరీవారితో అక్కడికి వచ్చాడు. సైనికులను వంద గజాల దూరంలో ఆ పార్కు గోడల మీద నుంచోపెట్టాడు. గుండ్లు అయిపోయేదాకా కాల్చమని ఆజ్ఞాపించాడు. ధనధనమని తుపాకులు పేలాయి. పిట్టల్లా జనం పడిచచ్చారు. రక్తం కాలువలు కట్టింది. పదినిమిషాల్లో 1,650 గుండ్లు కాల్చబడ్డాయి. 379 మంది చనిపోయారు. 1200మందికి గాయాలు తగిలాయి. తుపాకి గుండ్లు అయిపోగానే డయ్యర్ వెళ్ళి పోయాడు. జలియన్‌వాలాబాగ్‌ను ఏ భారతీయుడు మరచి పోలేదు. అది తల్చుకుంటే ఇవ్వాల్టికీ మన రక్తం వేడెక్కుతుంది.

భారత ప్రభుత్వం అక్కడ ఒక స్మారకచిహ్నాం నిర్మించింది. ఏప్రిల్ 13, 1961న మన రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ దానిని ఆవిష్కరించారు.

## సహాయ నిరాకరణ

మహాత్ముడు ప్రభుత్వాన్ని ఎదిరించమన్నాడు. దేశం మొత్తంలోనూ ప్రజలు ప్రభుత్వాన్ని ఎదిరించినారు. ప్రభుత్వం తుపాకి గుండ్లు కురిపించింది. అమాయకులను పొట్టన పెట్టుకుంది. ఏం చేయాలని మహాత్ముడు ఆలోచించాడు. ప్రభుత్వాన్ని అహింస ద్వారానే ఎదిరించాలన్నాడు. శాంతంగా సహాయ నిరాకరణ చేయమన్నాడు. అంటే ప్రభుత్వానికి ఏవిధంగానూ తోడ్పడవద్దని అర్థం. ప్రజలు సహాయం చేయకుండా ప్రభుత్వం ఎలా నడుస్తుంది? ప్రభుత్వం ఇచ్చిన బిరుదాలు, ప్రభుత్వపు ఉద్యోగాలు, పాఠశాలలు, కాలేజీలు వదిలి వేయమన్నారు. విదేశీవస్తువులు వాడవద్దన్నారు. ఖాదీ వాడమన్నారు. కల్లు, సారాయి మానివేయమన్నారు.

మోతీలాల్ నెహ్రూ, దాస్, వల్లభభాయి పటేల్, రాజగోపాలాచారి, రాజేంద్రప్రసాద్ తమ వృత్తులు వదిలివేశారు. ఎనిమిది వేలమంది విద్యార్థులు పాఠశాలలు వదిలివేశారు. ప్రభుత్వం నడిపించే పాఠశాలలు పాడుబడ్డాయి. అనేక జాతీయ పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయాలు వెలిశాయి.

సుభాస్ చంద్రబోస్ తన ఉద్యోగం వదిలేశాడు.

## స్వదేశీ

1921జూన్‌లో బొంబాయిలో కాంగ్రెస్ సభలు జరిగాయి. ఖద్దరు కట్టుకోవాలని తీర్మానించబడింది. ఇతర దేశపు బట్టలు తగలేయాలని నిర్ణయం జరిగింది. జూలై 21వ తేదీన బొంబాయిలో పెద్ద సభ జరిగింది. లక్షమంది సభకు వచ్చారు. పెద్దమంట వేయబడింది. బట్టల గుట్టలు ఆ మంటలో పడ్డాయి. ఇంగ్లీషువారి రాజ్యం కాలిపోతున్నట్లు ప్రజలు సంతోషంతో గంతులు వేశారు. కేకలు పెట్టారు.

ఆగస్టు నెలలో మలబారులో మొప్లాలు అనే తెగవారు తిరుగుబాటు చేశారు. వారు తెల్లవారిరాజ్యం అంతరించింది అనుకున్నారు. స్వరాజ్యం ఏర్పర్చుకున్నారు. అలీ సోదరులు మహాత్ముని దగ్గరి మిత్రులు. వారిని ప్రభుత్వం అరెస్టు చేసింది. మహాత్ముడు చాలా బాధపడ్డాడు. వెంటనే అందర్నీ విదేశీ వస్తువులు వదిలి వేయమన్నాడు.

అలీ సోదరుల్ని కరాచీలో విచారించారు. రెండు సంవత్సరాల శిక్ష విధించారు. ప్రజలు మండిపోయారు. మహాత్ముడు ఒక ప్రాంతంలో పూర్తి సహాయ నిరాకరణ చేయించాలన్నాడు. దానికి ఆయన గుజరాతులో బార్డోలీని ఎన్నుకున్నారు. మహాత్ముడు స్వయంగా బార్డోలీ ఉద్యమం నడిపిస్తానన్నారు.

## రాకుమారునిరాక

**17** నవంబరు 1922న ఇంగ్లాండు రాకుమారుడు బొంబాయి వచ్చాడు. బొంబాయి పాడుపడ్డట్లు అయింది. ఒక్క దుకాణం తెరువబడలేదు. ఒక్క ఫ్యాక్టరీ పనిచేయలేదు. బ్రహ్మాండమైన సభ జరిగింది. గుట్టలకొద్ది పరదేశపు బట్టలు తగులపెట్టబడ్డాయి. మహాత్ముడు ఉపన్యసించాడు. రాకుమారునికి స్వాగతం ఇవ్వడానికి ఎవరూ వెళ్ళలేదు. కొందరు ఆంగ్లో ఇండియన్లు, పార్సీవాళ్ళు మాత్రం వెళ్ళారు.

సభలో కొందరు దుండగులు ప్రజల్ని రెచ్చకొట్టారు. వారు కనిపించిన పార్సీవాణ్ణల్లా తన్నారు. మహాత్ముడు ప్రజల్లోకి వెళ్ళి ఆపుచేశారు. సభ జయప్రదంగా ముగిసింది. ప్రజలు ఇళ్ళకు తిరిగి పోతున్నారు. తోవలో కనిపించిన హోటల్నూ, విదేశీ వస్తువులనూ, తెల్లవారినీ మంటల్లో పడేశారు. సారాయి దుకాణాలు నాశనం చేశారు. ట్రాములు తగులబెట్టారు. పోలీసుస్టేషనుకు నిప్పు పెట్టారు.

పోలీసుల్ని కొట్టి చంపేశారు. 'హింస' జరుగుతున్న విషయం మహాత్మునికి తెలిసింది. వెంటనే అక్కడికి పరుగెత్తాడు. మహాత్ముణ్ణి చూశారు. ప్రజలు పిల్లుల్లా ఎక్కడివారక్కడికి వెళ్ళిపోయారు. పడిపోయిన పోలీసువారికి చికిత్స చేస్తూ అక్కడే ఉండిపోయారు. మహాత్ముడు పోలీసులను వైద్యశాలకు తీసికెళ్ళేదాకా అక్కడే ఉన్నారు.

మహాత్ముడు బార్డోలీ వెళ్ళడం మానుకున్నారు. తనలోని శక్తి అంతా ఆవిరి అయి లేచిపోయినట్లు భావించారు. "అంతా కలిసిమెలిసి ఉంటామని వాగ్దానం చేసేదాకా అన్నం ముట్టను" అన్నారు. నాలుగు రోజులు ఉపవాసం చేశారు. పోట్లాటలు చల్లబడ్డాయి. మహాత్ముడు ఉపవాసం విరమించారు.

19 నవంబర్‌నాడు బెంగాల్లో వాలంటీరు దళాన్ని ప్రభుత్వం నిషేధించింది. దేశంలో నాయకులందర్నీ అరెస్టు చేసింది. గాంధీ టోపీ పెట్టుకున్నవాణ్ణల్లా అరెస్టు చేసింది. ఖద్దరు కట్టుకున్న వాణ్ణల్లా జైల్లో పెట్టింది. వాలంటీర్ల బట్టలు విడిచి చెరువుల్లో పారేశారు. కాంగ్రెస్ కార్యాలయాలు కూల్చివేశారు. ఇండ్లు తగులబెట్టారు. పంటల్ని నాశనం చేశారు. ఇన్ని చేసినా ప్రభుత్వం ఓడిపోయింది. మహాత్ముడు గెలిచాడు. మహాత్మునితో రాజీ బేరానికి వచ్చింది ప్రభుత్వం. జైల్లో ఉన్న వారందర్నీ విడుదల చేయమన్నాడు మహాత్ముడు. ప్రభుత్వం అంగీకరించలేదు.

## చౌరాచౌరి

**1922** ఫిబ్రవరి 29వ తేదీన బార్డోలీ సత్యాగ్రహం ప్రారంభిస్తానన్నాడు మహాత్ముడు. మహాత్ముడు బార్డోలీ చేరాడు. ప్రజలంతా సిద్ధంగా వున్నారు. దేశం అంతా ఊపిరి బిగబట్టి 29 ఫిబ్రవరి కోసం ఎదురుచూస్తోంది.

ఉత్తర ప్రదేశంలో గోరఖ్‌పూర్ ఒక జిల్లా. ఆ జిల్లాలో చౌరాచౌరి ఒక చిన్న గ్రామం. ఆ ఊళ్ళో ఒక ఊరేగింపు జరిగింది. పోలీసులు ప్రజలమీద తుపాకులు కాల్చారు. మందుగుండు అంతా అయిపోయింది. పోలీసులు పారిపోయి పోలీసు స్టేషనులో దాక్కున్నారు. ప్రజలు పోలీసు స్టేషనుమీద పడ్డారు. తలుపులు మూశారు. నిప్పు అంటించారు. ఇరవైరెండు మంది పోలీసులు అందులోనే కాలి చచ్చారు. ఈ వార్త మహాత్ముని గుండెకు బాకులా గుచ్చుకుంది. విలవిల్లాడాడు. ఉద్యమం రద్దు చేశాడు. అయిదు రోజులు నిరసనదీక్ష కొనసాగించాడు.

గాంధీజీని సబర్మతి ఆశ్రమంలో అరెస్టుచేశారు. ప్రజల్ని రెచ్చగొట్టారని నేరం మోపారు. ఆరు సంవత్సరాల శిక్ష విధించారు. ఆయన్ను ఎర్రవాడ జైలుకు మార్చారు. జైల్లో మహాత్మునికి జబ్బు చేసింది. పూనాలోని సీజన్ ఆస్పత్రిలో చేర్చారు. దేశం అంతటా ఆయన కోసం ప్రార్థనలు జరిగాయి. మహాత్మునికి ఆపరేషన్ అయింది. బాగైనాడు. ప్రభుత్వం ఆయన్ను విడుదల చేసింది.

## బార్డోలీ

**1928**లో బార్డోలీ నుంచి రైతులు మహాత్ముని దగ్గరికి వచ్చారు. ప్రభుత్వం ఇరవైరెండు వంతులు పన్ను పెంచిందని వారు మహాత్మునికి చెప్పారు. సహాయనిరాకరణ చేస్తాం అన్నారు. వల్లభభాయి పటేల్ నాయకత్వం వహించాడు. ప్రభుత్వం కమీషన్‌ను నియమించాలన్నారు రైతులు. అప్పటిదాకా పన్నులు ఇవ్వం అన్నారు. ప్రభుత్వం పఠానులను పంపింది. భూములు లాక్కుంది. పశువుల్ని జప్తు చేసింది. భూముల నుంచి కదలవద్దన్నాడు పటేల్. రైతులు కదల్లేదు. రెండువందల యాభైమంది అరెస్టు అయినారు. ప్రభుత్వం ఓడిపోయింది. అందరూ విడుదల చేయబడ్డారు. కమీషను వేయబడింది. శిస్తు తగ్గించబడింది.



బార్డోలీ సత్యాగ్రహి 'గాంధీ'

## "సైమన్ తిరిగిపో"

భారతదేశపు స్థితిని గురించి విచారించడానికి తెల్లదొర తనం కమీషన్ నియమించింది. ఆ కమీషన్‌కు నాయకుడు సైమన్ కాబట్టి దాని పేరు సైమన్ కమీషన్ అని పడింది. కమీషన్ సభ్యుల్లో ఒక్కడూ భారతీయుడు లేడు. ఆ కమీషన్ను బహిష్కరించాలన్నాడు మహాత్ముడు.

ఫిబ్రవరీ మూడవ తేదీన కమీషన్ బొంబాయి చేరింది. యాభై వేలమంది ప్రజలు నల్లజెండాలు పట్టుకుని ఊరేగారు. "సైమన్ తిరిగిపో" అనే నినాదాలు ఆకాశం అంటాయి. పోలీసులు తుపాకులు కాల్చారు. కమీషన్ ఢిల్లీ, కలకత్తా, మద్రాసు వెళ్ళింది. అంతటా వారికి నలజండాలు ఎదురు అయినాయి.

రాక్షసత్వం జరిగింది లాహోరులోనే. లాలాలజపత్‌రాయ్ పంజాబు నాయకుడు. ఆయన సింహంలాంటివాడు. అందుకే ఆయనకు పంజాబు కేసరి అని పేరువచ్చింది. అరవై నాలుగు సంవత్సరాల లజపత్‌రాయ్ ఊరేగింపుకు నాయకత్వం వహించాడు. ఒక తెల్ల అధికారి సింహంమీద పడ్డాడు. కర్రతీసుకొని గుండెమీద కొట్టసాగాడు. సింహానికి అహింస జ్ఞాపకం వచ్చింది. ఎదురు తిరగలేదు. ఒక్క మనిషి సహితం కదల్లేదు. అధికారులు ఇష్టం వచ్చినట్లు బాదారు. లజపత్‌రాయ్ గుండెమీద గాయం తగిలింది. చేతికి ఒక గాయం తగిలింది. 17 నవంబర్‌నాడు లాలాలజపత్‌రాయ్ చనిపోయాడు.

పంజాబు ఉడికిపోయింది. పోలీసు సూపర్నెంటును కాల్చి చంపారు. భగత్‌సింగ్ ఢిల్లీ శాసనసభలో బాంబులు విసిరాడు. ఆయన్ను, ఆయన మిత్రులను ఉరితీశారు. వంగదేశం పొంగిపోయింది. సుభాస్ చంద్రబోసు నాయకత్వం వహించాడు. "నాకు రక్తం ఇవ్వండి, మీకు స్వరాజ్యం ఇస్తా"నన్నాడు. జవహర్‌లాల్ నెహ్రూ యువకులకు నాయకత్వం వహించాడు. ప్రజల ఓపిక చచ్చిపోయింది. ఏదైనా చర్య తీసుకోవాలని వారు తొందర పడుతున్నారు.

## ఉప్పు

**1929** డిసెంబరులో లాహోరులో కాంగ్రెస్ జరిగింది. తెల్లవారికి చీమ కుట్టలేదు. "సంపూర్ణ స్వరాజ్యమే కాంగ్రెస్ లక్ష్యం" అన్నారు మహాత్ముడు. కాంగ్రెస్‌వారు శాసనసభల్లో ఉండవద్దు అన్నారు. పన్నులు ఇవ్వవద్దన్నారు. సత్యాగ్రహం ఎప్పుడు ప్రారంభించాలి? ఎలా ప్రారంభించాలి? ఈ విషయాలు మహాత్ముడు నిర్ణయించాలి. ఆయన రాత్రింబవళ్ళు ఆలోచించాడు. ఆరువారాలు ఆలోచించాడు.

12 మార్చి ఉదయం మహాత్ముడు ప్రార్థనలు జరిపారు. డెబ్బై ఎనిమిది మంది ఆశ్రమవాసుల్తో కాలినడకన సముద్రానికి బైల్దేరారు. ఊరూరా సభలు జరిగాయి. కల్లు, సారాయి నల్లమందు మానేయమని బోధించాడు. 5 ఏప్రిల్ 1930న మహాత్ముడు దండి చేరాడు. అంటే ఇరవై మూడు రోజులు నడిచాడన్న మాట. ఆయన వెంట అనేక వేలమంది సిద్ధం అయినారు. నాటి రాత్రి ఎవరూ నిద్రపోలేదు. ప్రార్థనలు చేశారు. తెల్లవారింది. మహాత్ముడు



ఉప్పు సత్యాగ్రహానికి

సముద్రస్నానం చేశాడు. సముద్రపు ఒడ్డున ఉప్పు చేత్తో తీశాడు. ప్రభుత్వపు ఆజ్ఞను ధిక్కరించాడు. దండి భారత ప్రజలకు యాత్రాస్థలం అయింది.

మహాత్ముడు దారి చూపాడు. దేశం మొత్తం ప్రభుత్వాన్ని ధిక్కరించింది. పిచ్చిగా అరెస్టులు చేశారు పోలీసులు. బొంబాయి కాంగ్రెస్ కార్యాలయంలో ఉప్పు తయారుచేశారు. పోలీసులు దానిమీద పడ్డారు. అరవై వేలమంది జనం కూడారు. వేలమందికి బేడీలు వేశారు. తాళ్ళుగట్టి లాక్కుపోయారు. మహాత్ముడు ఎత్తిన పిడికెడు ఉప్పు 1600 రూపాయలకు అమ్మబడింది. దేశం మొత్తంలోనూ అరవై వేలమంది అరెస్టు అయినారు. మిలిటరీవారు పెషావరుల్లో డెబ్బైమందిని కాల్చి చంపారు. పండిత నెహ్రూకు ఆరు నెలల శిక్ష విధించబడింది.

## గుండ్రని బల్ల

**1930**నవంబరులో లండన్‌లో గుండ్రని బల్ల సమావేశం జరిగింది. ప్రభుత్వం భారతీయుల్ని పిలువలేదు. ఇర్విన్ మహాత్మునితో మంతనాలు సాగించాడు. వారిద్దరూ ఒక ఒడంబడికకు వచ్చారు. దాన్నే గాంధీ - ఇర్విన్ ఒడంబడిక అంటారు. జైల్లో ఉన్నవాళ్ళందర్నీ విడుదల చేయడం జరిగింది. రెండవ గుండ్రని బల్ల సమావేశానికి మహాత్ముణ్ణి పిలవడం జరిగింది. ఆయన కొళ్ళాయి గుడ్డతోనే లండను వెళ్ళాడు. జార్జిగారు విందుకు పిల్చాడు. అట్లాగే వెళ్ళారు.

## క్విట్ ఇండియా

1939లో ప్రపంచ యుద్ధం ప్రారంభం అయింది. బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశాన్ని కూడా యుద్ధంలోకి లాగింది. మహాత్ముడు వ్యతిరేకించాడు. 1942 ఆగస్టు 7వ తేదీన బొంబాయిలో కాంగ్రెస్

మహాసభ జరిగింది. ఇంగ్లీషువారు భారతదేశాన్ని వదిలిపోవాలన్నారు మహాత్ముడు. సహాయ నిరాకరణ ప్రారంభించాలన్నారు. 9వ తేదీ ఉదయం మహాత్ముడు, నెహ్రూ మొదలైన నాయకులందర్నీ అరెస్టు చేసింది ప్రభుత్వం. నాయకులంతా జైళ్ళకు వెళ్ళడంతో ప్రజలు రెచ్చిపోయారు. ప్రభుత్వ భవనాలు తగుల పెట్టబడ్డాయి. రైలుపట్టాలు పెరికి వేయబడ్డాయి. కొన్ని ప్రదేశాల్లో చక్రవర్తి రాజ్యమే అస్తమించింది.

22 ఫిబ్రవరి 1944న జైల్లో కస్తూరీబాయి చనిపోయింది. మహాత్ముని గుండె పగిలింది. అయినా మహాత్ముడు కదా. ఆయనకు సుఖమూ దుఃఖమూ సమానములే.

## రెండుముక్కలు

వైస్రాయి వేవెల్ పదవి విరమించారు. లార్డ్ మౌంటు బాటన్ పదవి స్వీకరించాడు. అతను మన దేశానికి చివరి వైస్రాయి.

వైస్రాయి భారతదేశం చేరాడు. "పాకిస్తాన్" లేకుంటే ఇండియా సర్వనాశనం అవుతుంది అని హెచ్చరించాడు జిన్నా. వైస్రాయి బాపూజీని పిలిచాడు. పదమూడు రోజులు వైస్రాయి మహాత్మునితో మంతనాలు జరిపాడు.

మౌంటుబాటన్ జిన్నానుకూడా పిలిపించాడు. ఆయనతో పన్నెండు రోజులు మాట్లాడాడు. ఢిల్లీలో కాంగ్రెస్ పెద్దల సభ జరిగింది. పాకిస్తాన్ కోసం అంగీకరించాలా వద్దా? అనే ఎషయం చర్చకు వచ్చింది. తుదకు పాకిస్తాను ఇచ్చివేయడానికే నిర్ణయం జరిగింది.

1947 ఆగస్టు 15న భారతదేశం స్వతంత్రం అయింది. ఇందులోంచి ఒక ముక్క చీలిపోయింది. పాకిస్తాను రాజ్యం ఏర్పడింది. రెండువందల సంవత్సరాల తెల్లవారిపాలన అంత మొందింది. దేశమంతా సంబరాల్తో నిండిపోయింది. పల్లెలు, పట్నాలూ అన్నీ దివ్వెలతో వెలిగిపోయాయి. దేశంలో ఆనందం పొంగి పార్లింది.

అపుడు బాపూజీ ఏం చేస్తున్నాడు? ఉత్సవాల్లో పాల్గొనడానికి ఢిల్లీ రావలసిందని కోరింది జాతీయ ప్రభుత్వం. అప్పుడు ఆయన కలకత్తాలో ఉన్నాడు. ఆయన వెళ్ళలేదు. "నేను ఉత్సవాల్లో పాల్గొనను" అన్నాడు. ఆ రోజంతా ఉపవాసం చేశాడు.

## ఢిల్లీ కల్లోలం

పంజాబు రక్తంలో మునిగి తేలుతూంది. బాపూజీ పంజాబుకు బైల్దేరారు. పాకిస్తాను నుంచి అనేకమంది శరణార్థులు ఢిల్లీ వస్తున్నారు. వారి గాథలు విని హిందువులు ఢిల్లీ ముసల్మానుల గొంతులు కోయసాగారు.

ఢిల్లీ మీదినుంచే పంజాబు వెళ్ళాలి. గాంధీజీ బండి ఢిల్లీ చేరింది. పండిత నెహ్రూ, సర్దార్ వల్లభభాయి పటేల్, రాజకుమారి అమృతకౌర్ స్టేషనుకు వచ్చారు. ఢిల్లీ దురంతాలు బాపూజీకి తెలియజేశారు. బాపూజీ ఢిల్లీలో దిగిపోయాడు.

బాపుజీ ఢిల్లీ అడుగుపెట్టేవరకు కొంత శాంతి ఏర్పడింది. ఆయన పంజాబుకు ప్రయాణం అయినాడు. ఆనాడే ఒక సంఘటన జరిగింది. ముసల్మానులు అల్లర్లు చల్లారాయను కున్నారు. ఒక ముసల్మాను వర్తకుడు కొట్టు తాళం తీస్తున్నాడు. వీపులోంచి తుపాకి గుండు దూసుకుని పోయింది. నగరంలో పూర్తిగా శాంతి ఏర్పడలేదు. బాపూజీ నిరసన వ్రతం చేయడానికి సిద్ధం అయినాడు. నెహ్రూ, పటేల్, అయన్ను వారించారు. కాని బాపూజీ వింటాడా?

## చివరి దీక్ష

**1948** జనవరి 13న బాపూజీ నిరసన దీక్ష ప్రారం భించాడు. భారతదేశంలో రెండు భాగాల్లోని హిందూ, ముసల్మానులు సఖ్యంగా ఉండాలని నిరశనవ్రతం చేస్తున్నానన్నారు.

మొదటి రోజు ఆయన ప్రార్థన సమావేశానికి వెళ్ళారు. సభలో ఒకరు బాపూజీ ముసల్మానుల కోసం ఉపవాసం చేస్తున్నారు అన్నాడు. "నా జీవితం మొత్తం అల్పసంఖ్యాకుల కోసరమూ, దుఃఖితుల కోసరమూ అంకితం చేశాను" అన్నారు.

రెండవరోజు ప్రార్థనా సమావేశానికి వెళ్ళవద్దని సలహా ఇచ్చారు డాక్టర్లు. సరేనన్నాడు. ఆ సమావేశంలో చదవాల్సిందాన్ని రాయించాడు. ప్రార్థనా సమావేశపు సమయం అయింది. ఆయన నిలువలేకపోయాడు.

బాపూజీ వైద్యుల్ని పరీక్ష చేయనీయలేదు. నీరు తాగ నన్నారు. అయిన బరువు రెండు పౌనుల చొప్పున తగ్గుతూంది. "భగవంతుడే రక్షిస్తాడు" అన్నారు.

మూడవరోజు రాత్రి 2.30గ.లకే మేల్కొన్నాడు. వేడినీళ్ళ స్నానం చేశాడు. పాకిస్తానుకు చెల్లించాల్సిన యాభై ఐదు కోట్లు చెల్లించమని పండిత నెహ్రూ ప్రభుత్వానికి ఉత్తరం రాయించారు. ఆ రోజున నెహ్రూ, పటేల్ మొదలైన మంత్రులు ఆయన దగ్గరికి వెళ్ళారు. యాభై ఐదు కోట్లు చెల్లించడంలోగల ఇబ్బందిని తెలియజేశారు. బాపూజీ వినలేదు. యాభై ఐదు కోట్లు పాకిస్తానుకు చెల్లించబడినాయి.

17వ తేదీన ఆయన బరువు 107 పౌనుల దగ్గర నిలిచి పోయింది. భారత పాకిస్తాన్ల నుంచి అనేకమంది నాయకులు టెలిగ్రాములు పంపారు. బాపూజీకి కొద్దిగా విశ్వాసం కలిగింది. నగరంలో పరిస్థితి తెలుసుకోవడానికి తన మనిషిని పంపారు.

18వ తేదీకల్లా నగరంలో శాంతి ఏర్పడింది. పారిపోయిన ముసల్మానులు తిరిగి వచ్చేశారు. క్రమక్రమంగా వారు తమ పనులుకూడా చేసుకోవడం మొదలుపెట్టారు. అన్ని మతాలవారూ బాపూజీ దగ్గరికి వచ్చారు. ఆయన్ను దీక్ష విరమించమని ప్రార్థించారు.

అన్ని మతగ్రంథాల నుంచి కొన్ని భాగాలు చదవబడి నాయి. ఆ తరువాత ఎనిమిది ఔన్సుల నారింజరసం తాగారు.

## అస్తమయం

మర్నాడు బాపూజీ ప్రార్థనా సమావేశానికి వెళ్ళారు. ఆయన్ను కుర్చీలో మోసుకుని వెళ్ళాల్సి వచ్చింది. ఆయన మాట చాల నీరసంగా ఉండింది. రెండవనాడు సమావేశానికి వెళ్ళారు. సభ శాంతంగా జరుగుతూ వుంది. బాపూజీ ఉపన్యసిస్తున్నాడు. సభలో ఒక చేతిబాంబు పేలింది. ప్రజలంతా దృష్టి అటువైపు మళ్ళించారు. "ఎందుకలా బెదుర్తారు? నేను చెప్పేది వినండి" అన్నారు బాపూజీ ఆ ధ్వని విననే విననట్లు.

25 జనవరి నాటికి సమావేశానికి జనం బాగా వచ్చారు. చలి కాలంలో నేల చెమ్మగా ఉంటుంది. కాబట్టి చిన్నచాపలు గాని, దళసరి బట్టగాని తెచ్చుకోవలసిందని ప్రజల్తో చెప్పారు బాపూజీ.

1948 జనవరి 30, సాయంకాలం గం॥ 4-30 అయింది. సర్దార్ పటేల్ బాపూజీ దగ్గరకు వచ్చాడు. అది బాపూ భోజన సమయం. పాలు, ఉడికిన కూరలు, నిమ్మకాయలు, వెన్న బాపూజీకి అందించబడినాయి. పటేల్‌తో మాట్లాడ్తూనే భోజనం చేశారు. అది ఆయన చివరి రోజు.

సాయంకాలం 5 గంటలు అయింది. ప్రార్థన సమయం అయింది. సమయానికి సరిగ్గా పనిచేయడం బాపూజీ అలవాటు. ఆయన సర్దార్ పటేల్ను పంపించారు. "అభా, మనూ" అనే ఇద్దరు అమ్మాయిల భుజం మీద చేయివేసి ప్రార్థన సమావేశానికి చేరాడు.

అయిదు వందల మంది స్త్రీ - పురుషులు వంగి నమస్కరించారు. "పది నిమిషాలు ఆలస్యంగా వచ్చాను" అంటూ వేదిక ఎక్కడానికి ముందుకు సాగారు. ఒకడు ముందు వరుసకు చేరాడు. అతని కుడిచేయి జేబులో ఉంది. అతడు వంగి మహాత్మునికి మొక్కాడు. త్వరగా వేదిక ఎక్కాలి అని. మనూ

అతన్ని తోసివేయబోయింది. వాడు మూడు పిస్తోలు గుండ్లు బాపూజీ ఎదలో కాల్చాడు. బాపూజీ పెదవుల మీది చిరునవ్వు మాయం అయింది. "హరేరాం, హరేరాం" అంటూ పడిపోయాడు.

సిగ్గుతో సూర్యుడు కుంగిపోయాడు. భారత భాగ్యవిధాత అస్తమించాడు. దేశమంతా కటిక చీకట్లో మునిగిపోయింది. కన్నీటి ధారలతో సముద్రాలు ఉప్పొంగిపోయాయి. దుఃఖం భరించలేని కొందరు సముద్రంలో దూకి ప్రాణాలు వదిలారు.

మరుసటిరోజు బాపూజీ భౌతిక దేహానికి "రాజ్‌ఘాట్"లో అంత్యక్రియలు జరిగాయి. అక్కడ ఒక అందమైన సమాధి నిర్మించబడింది.

1948 జనవరి 30 మనకు చాలా దుర్దినం. మహాత్ముడు మనను విడిచిపోయారు. బాపూజీ కలలు కన్న స్వరాజ్యం నిజం చేయడం మన విధి. ఆయన ఆశలు అడియాసలు కాకుండా చేయాలి.